# బాల
# గద్యకావ్యకథలు.

శ్రీ మహత్తరాట్పుత్రాది నాటకకర్తయు,
దశకుమారచరిత్రానువాదకర్తయు,
శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటుకార్యస్థాన ప్రధానపండితుఁడును

అగు

## శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిచే

రచింపఁబడెను.



ప్రథమముద్రణము.

పిఠాపురము

శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాల.

1931.

ఓమ్.

సుప్రసిద్ధుఁడగు బాణమహాకవి యేడవశతాబ్దమున సంస్కృతభాషలో రచించిన గద్యకావ్యములు రెండు. హర్షచరిత్రయు, కాదంబరియును. అవి యలంకారాలంకృతములు. అందును శ్లేషభూయిష్ఠములు. అలంకారాపేక్ష లేకయే అందలి కథారస మెంతయో మనోహరముగా నున్నది గాని శ్లేషాతివర్ణనాదిప్రతిబంధమునఁ గథారసాస్వాదము పండితులకే దుర్లభము. అందు హర్షచరిత్ర చరిత్రాత్మకము. అందు కవిచరిత్రయు, ప్రభుచరిత్రయుఁ గూడఁ గలవు. సహోదరుల పరస్పర స్నేహము కథాసర్వస్వము. పితృభక్తి పుత్రవాత్సల్యములు ప్రధానములు. కాదంబరిలోనికథ కల్పితము స్నేహమయము. మిత్రుల సుఖదుఃఖసమత్వము సుస్పష్టము. బాణుఁడిది సగము రచించి కాలధర్మము నొందఁగా ఆతనిపుత్రుఁడు పూరించెను. రెండిటియందును భూతదయయు పరమార్థబుద్ధియు సాంఘిక సామరస్యమును ప్రతిపాద్యాంశములు.

అట్టి బాణగద్యకావ్యకథలు భాషాపరిచయ మత్యల్పముగా నున్నవారికిఁ గూడ సుబోధమగునట్లు రచించితిని. రచించునపుడు మితిమీఱినవర్ణనలును, నేఁటి నాగరకతననుసరించి బాలికాబాలకబృందము పఠింపఁదగనిభాగములును పరిహరించితిని. బాణగద్యకావ్యకథలు అని పేరుపెట్టి కాదంబరి మొదటిభాగముగాను, హర్షచరిత్ర రెండవభాగముగాను ఏర్పఱచితిని.

ఇట్లు

పీఠికాపురము.
ప్రమోద రథసప్తమి.

విధేయుఁడు,
శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రి.

# కాదంబరి.



శ్రీభరతవర్షమున వేత్రవతీనదీతీరమందు విదిశయను నగరము కలదు. అందు శూద్రకుఁడనురాజు నివసించుచుండెను. ఆతఁడు చక్రవర్తిలక్షణములుగలవాఁడు. సమస్తరాజులను పరాక్రమమున వశపఱచుకొని సామంతులనుగాఁ జేసి వారివలనఁ బన్నును గానుకలను బుచ్చుకొని ప్రజలసౌఖ్యముకొఱకుపయోగించుచుండువాఁడు. సకలగుణసంపన్నుఁడు. ఆతనికిఁ దనతో సమానకులసంజాతపుత్రులనేకులు సహవాసులు గలరు. వారితోఁ గలసిమెలసి తిరుగుచుండెడివాఁడు. ఒకప్పుడు శాస్త్రపరిసంగము. వేఱొకతఱిఁ గావ్యరచన. మఱొకవేళ నితిహాసపురాణాదిశ్రవణము. ఒకసమయమున వీణాగానము. మఱొకకాలమునఁ జిత్రలేఖనము. ఒకనాఁడు వేఁట. మఱొకదినమునఁ బెద్దలశుశ్రూష. ఇట్లు సత్కాలక్షేపముతో మిత్రులఁ గలసి దివారాత్రములు గడపుచుండెను.

యౌవనము వచ్చినది. రూపము మన్మథునిమించినరూపము. ఆతనికి స్త్రీసుఖమందుమాత్రము అపేక్ష కలుగలేదు. మంత్రులు, మిత్రులు, బంధువులు, ఆప్తులును సంతతి పడసి వంశము నిలఁబెట్టవలయును అని బహువిధములఁ బ్రార్థించిన

ను వినఁడయ్యె. క్రమముగా స్త్రీసుఖమున నతనికి ద్వేషము కలిగినది. ఎప్పుడును మిత్రులతోఁ గలసి వినోదముగాఁ గాలము గడపుచుండుటయే యాతని కిష్టము.

అతఁ డొకనాఁ డాస్థానమంటపమున నుండఁగా ద్వారపాలురాం డొకతె వచ్చి "దేవా! దక్షిణాపథమునుండి యొక చండాలకన్యక యొకచిలుకను బంజరములో నుంచి తెచ్చి ద్వారమున నున్నది. 'సకలరత్నములకును ప్రభువే పాత్రుఁడు. ఈపక్షిరత్నము సకలభువనరత్నము. ఇది దేవరకు సమర్పింప దేవరపాదమూలమునకు వచ్చితిని. దేవరదర్శన మపేక్షించుచున్నాను.' అని మనవిచేయుచున్నది. తర్వాత దేవర చిత్తము" అనెను.

ఆమాటలు విని రాజు కుతూహలము నొంది సమీపమున నున్న రాజుల మొగములు చూచి 'తప్పేమున్నది?' రమ్మనుమని ఆజ్ఞ యిచ్చెను. అంతఁ బ్రతీహారి చండాలకన్యకను ఆస్థానమంటపమునకుఁ దీసికొనివచ్చెను.

చండాలకన్యక వచ్చి రాజసహస్రమధ్యమున నున్న రాజును జూచి దూరమునుండియే రాజదృష్టి తనవైపున నాకర్షించుటకై తనచేత నున్న వెదురుబెత్తముతో నేలపైఁ గొట్టెను. ఆధ్వని విని రాజు చండాలకన్యక వైపునకుఁ జూచెను. చండాలకన్యకకు ముందట నొకపురుషుఁ డుండెను. అతఁడును చండాలుఁడే కాని సౌమ్యుఁడు. తెల్లనివస్త్రములు

ధరించి యార్యవేషముతో నుండెను. ఆతనికి దల కొంచెము నరసినది. పెద్దవయస్సే కాని చిరకాలము వ్యాయామము చేసినవాఁడు గాన శరీరసంధులు శిథిలములు గా లేదు. దేహము దృఢముగా నుండెను.

ఆమెవెనుక నొకచండాలబాలుఁడు గలఁడు. ఆతని చేతిలో నొకబంగారపు బంజర మున్నది. దానిలో నొక చిలుక యున్నది. చండాలకన్యక నల్లనికంచుకిను మడుములు గప్పునట్లు తొడిగికొన్నది. మనోహరరూపముతో నవయౌవనములో జగన్మోహిని యై సర్వజనహృదయముల నాకర్షించుచుండెను. ఆచండాలకన్యకతోడి ప్రతీహారి "దూరముగా నుండియే చూడుము" అని చెప్పుచుండెను.

రాజు తెప్పిరిల్లి యాచండాలకన్యకను జూచి యామె రూపరేఖావిలాసముల కాశ్చర్యము నొందె "ఓహో! బ్రహ్మ యనస్థానమున నిట్టిరూపసంపద గలిగించినాఁడే. అయ్యో! అస్పృశ్యులజాతిలో నీకన్యకను సృజించినాఁడేమి. అస్పృశ్యురాలు గాన నీమెను సృజించునపుడు చేతితో ముట్టకొనకుండగనే సృజించియుండును. కావుననే యీమె కింతకాంతిగలిగినది. ఆబ్రహ్మమోటచేతులు తగిలినయెడల నీమె కింతకాంతి యెట్లుండును? ఏమైన నేమి బ్రహ్మ అపాత్రపుఁబని చేసినాఁడు." అనియనుకొనుచుండెను.

అట్లాలోచించుచున్నరాజునకుఁ జండాలకన్యక నమ

స్కారముచేసి రత్నవేదికపైని కూర్చుండ నాసభలో వచ్చినపురుషుఁడు పంజరములో నున్నచిలుకను జూపుచు "దేవ! ఈ శుకముపేరు వైశంపాయనుఁడు. శాస్త్రములును, రాజనీతులును పురాణేతిహాసాదులును వీనికిఁ దెలియనివి లేవు. వీనికి స్వయముగాఁ గావ్యనాటకాఖ్యాయికాదులు రచించునైపుణ్యముగలదు. ప్రణయకలహము నొందినదంపతుల మరలఁ గలుపుటలో నతిచాతుర్యమున్నది. స్త్రీపురుషలక్షణములు దెలుపుసాముద్రికవిద్య హస్తగతము. గజతురగాదిలక్షణజ్ఞాన మెంతయో గలదు. ఇదియు నదియు ననవేల? సకలవిద్యలలోను పారంగతమైనబుద్ధివిశేషము గలదు కావుననే యిది సకలభువనరత్నము. ఇట్టిరత్నములకుఁ బ్రభువులే పాత్రులని మీకు సమర్పింప మారాజకన్య దీనిని దేవపాదసన్నిధికిఁ దీసికొని వచ్చినది. దీనిని దేవర స్వీకరింపవలయును" అని చెప్పి శుకపంజరము రాజుమ్రోల నుంచి కొంచెము దూరముగా దొలఁగెను.

అంతఁ జిలుక రాజాభిముఖమయి కుడిపాద మెత్తి సుస్పష్ట మధురోచ్చారణతో రాజు నుద్దేశించి "జయ జయ" అని యీపద్యము చదివెను.

"రాజ! నీ రిపుస్త్రీలయురఃప్రదేశ
మశ్రుజలపాతమున స్నాన మాచరించి

హృదయశోకాగ్నిదరి నుండి యొక్కహార (1)
మైన విడనాడె వనిత మది పూనెనో. "

రాజాశ్చర్య మొంది సంతోషముతోఁ బ్రక్క నున్న కుమారపాలితుఁ డను ప్రధానునితో నిట్లనియె "వింటివా! ఆశుక మెంతస్పష్టముగా పద్యము నుచ్చరించినదో ఎంత గంభీరముగాఁ జదివినదో ఎంత భావముతోఁ బలికినదో అంత స్పష్టముగా నుచ్చరించుటయే మొదటియాశ్చర్యము. రెండవది సంస్కారవంతుఁ డగు మనుష్యునివలె సందర్భానుసారముగాఁ దాను వచింపఁ దలఁచినవిషయమును బుద్ధిపరివర్తించుట. తర్వాత సంప్రదాయానుసారముగాఁ గుడికాలెత్తి జయశబ్ద ముచ్చరించి పద్యము పఠించుట సాధారణముగాఁ బశువులును, పక్షులును ఆహారనిద్రాభయాదులందే ప్రవృత్తి గలవి యగును ఇదేమి మహాచిత్రముగా నున్నది."

మంత్రి చిఱునవ్వు నవ్వి "రాజా! ఇం దాశ్చర్య మేమున్నది? శుకశారికాదిపక్షులు విన్నమాటలు తిరిగి యట్లే యుచ్చరించు నని మీ రెఱుఁగరా? అందులో జన్మాంతర సంస్కారమునుబట్టియుఁ బుద్ధిప్రయత్నమునుబట్టియు నదక సంస్కారము దీనికిఁ గల్గినది కాని యింతవింత యేమియున్నది. అదికాక మును చిలుకలకు మనుష్యులకువలెనే [illegible]

(1) హారము - ముత్యాలపేరు (2) ఆహారము. చూ. పంచతంత్రము 2-74. విన్నం జంపి మహాశుపాఠముగ పండించం నున్నాఁడు. వ్యవహారమునను గలదు.

మాటలాడెడిశక్తి యుండెడిది. అగ్నిశాపమున స్ఫుటముగా నుచ్చరించుశక్తి పోయె నని పౌరాణికులు చెప్పుదురు.” అని చెప్పుచుండ రెండుజాములాయె నని తెలుపు పటహనాదము ను దానివెంట శంఖధ్వనియు వినంబడినవి. రాజది విని స్నాన సమయ మగుటం జేసి రాజవర్గమునకు సెల విచ్చి యాస్థాన మంటపమునుండి లేచి “విశ్రమింపు” మని చండాలకన్యక తో స్వయముగాఁ జెప్పి “వైశంపాయనుని లోపలికిఁ దీసి కొనిపోయి స్నానభోజనాదులు చేయింపు” మని (1)యడప కత్తె నాజ్ఞాపించి కొలఁదిపరివారముతో లోపలికి వెడలెను.

అంతఁ దచ్చటి నలంకారము లన్నియుం దీసివైచి వ్యాయామము చేయు చోటి కరిగి వ్యాయామసాధనములతో సహవాసులును సమానవయస్కులు నగు రాజకుమారులతోఁ గలసి చెమటపట్టువఱకు వ్యాయామము చేసి స్నానభూమి కరిగెను. రాజా స్నానాంతరము పాముకుబుసమువంటి తెల్లని సన్నపుబట్టలు కట్టుకొని యొకతెల్లబట్టతోఁ దలకుఁ బిడి పెట్టుకొని మంత్రపూత మగుజలాంజలితోఁ బితృతర్పణము గావించి, సూర్యుని నమస్కరించి శివారాధనము చేసి సహపంక్తికి రాఁదగినరాజపుత్రులతో షడ్రసోపేత మగుభోజనము గావించి యాస్థానమండపమున కుండెను. ప్రతీహారిని బిలిచి

(1) అడపకత్తె—తాంబూలకరండవాహిని, తాంబూలపుదిత్తిగాని వెట్టెగాని పట్టుకొనునది).

"యంతఃపురమునుండి వైశంపాయనుని దీసికొని ర"మ్మని యాజ్ఞాపింప నామె వెడలి క్షణమాత్రములోనే వైశంపాయనుఁడున్న పంజరము చేతఁ బట్టుకొని వచ్చెను.

రాజు వైశంపాయనుని బలుకరించి "వైశంపాయనా! ఆహారపదార్థము కొంచెమైనను పుచ్చుకొంటివా?" అని యడుగఁగా "పుచ్చుకొన్నాను. మత్తకోకిలనేత్రములవలె రక్తవర్ణసజంబూఫలరసము కావలసినంత మనస్సుదీరునటుగాఁ ద్రాగితిని. దానిమ్మగింజ లెన్నియో భుజించితిని. నానవైచిన ప్రాంతయుసిరికాయలు ఎన్నో తింటిని. అవి ద్రాక్షపండ్ల వలె నున్నవి. దేవివారము స్వహస్తములతోఁ బెట్టినదంతయు నమృతతుల్యముగా నుండె" నని చెప్పుచున్న వైశంపాయనునిమాట కడ్డము వచ్చి రాజిట్లనియెను. "అదంతయు నట్లుండనిమ్ము. నాకుఁ గలకౌతూహలము దీర్పుము. నీ వేదేశమునఁ బుట్టితివి? నీకు నామకరణ మెవరు చేసిరి? నీతల్లి యెవరు? నీతండ్రి యెవరు? నీకు వేదము లెట్లు వచ్చినవి? నీకు శాస్త్రపరిచయ మెట్లు గలిగినది? కళలన్నియు నెట్లు నేర్చితివి? పూర్వజన్మజ్ఞాన మున్నదా? లేదా, వరమహిమయా? పక్షిరూపము దాల్చి ప్రచ్ఛన్నుఁడవై యుంటివా? అట్లైన పూర్వనివాస మెక్కడ? నిజముగా నీ వెవరవు? పంజరబంధ మెట్లు సంభవించినది? చాండాలకన్యక చేతిలో నెట్లు చిక్కితివి? ఇక్కడకు వచ్చుటకుఁ గారణ మేమి?

అని యడుగ వైశంపాయనుఁడు క్షణమాత్ర మేదియో ధ్యానముచేసి " దేవ ! నాకథ పెద్దది. వినఁ గుతూహలమున్నచో వినుము. మనవిసేసెదను " అని యిట్లు చెప్పఁ దొడఁగెను.

వింధ్యారణ్యము మీరు వినియున్నదేగదా! అందున్న యగస్త్యాశ్రమమునకు సమీపమునఁ బంప యనుపద్మసరస్సు గలదు. దానిపశ్చిమతీరమున గొప్పశాల్మలీవృక్ష మొకటి గలదు. అది యాకసము నంటుచు వింధ్యమంతయు వ్యాపించి యుండెను. దానితొఱ్ఱలలో, కొమ్మలలో, చిగురుజొంపములలో, కొమ్మమొదళ్ళలో, ఎండినపట్టలలో ననేకసహస్రపక్షికులములు నివసించుచుండెను. అది యెవ్వరికి నెక్క శక్యము గానిది గానఁ బక్షులన్నియు నెంతయో నమ్మకతో నిర్భయముగాఁ దమతమగూళ్లలోఁ గాపురముచేయుచుండెను. వానిలోఁ జిలుకలు గుంపులుగుంపులుగాఁగూడుకొని యాహారము దెచ్చికొనఁబోయి, మరలఁ దిరిగివచ్చి గూళ్లలో నున్నపిల్లలకు ముక్కులతోఁ దెచ్చినఫలరసములును గింజలును బెట్టి యధికమగునపత్యప్రేమముతోఁ బిల్లలను రొమ్ములక్రిందఁ బెట్టుకొని రాత్రులు గడుపుచుండెడివి. వానిలో నొకముదుసలిచిలుకకు దైవవశమున నేను కొడుకనై పుట్టితిని. నేను పుట్టఁగానే నా తల్లి ప్రసవవేదనచే లోకాంతరగతురా లయ్యెను. భార్యావియోగదుఃఖితుఁడయ్యును నాతండ్రి పుత్త్రప్రేమచేత నన్నుఁ బోషించుటయే ప్రధానకార్యమని యెంచి యాదుఃఖ మణఁ

చుకొని నన్నుఁ బోషించుచుండెను. ఆతఁడు భార్యావియోగ దుఃఖముచేతఁ గొంత కృంగిపోయినాఁడు. వార్ధకముచేత తి క్కలెగురుట కుదరకపోయెను. ముక్కుకొనను బాటవ ము తగ్గిపోయినది. చంచుపుటముతో నితరపక్షులగూళ్లనుండి పడిపోయినవరిమెతుకులనుండి యెట్లో బియ్యపుగింజ లేరి కొనియు, చిలుకలు తినఁగా పుడమిక్రిందఁ బడిపోయినపక్వముక్క లు పట్టుకొనియు, దూరముగాఁ బోవుట కోపిక లేక యటనే మూ త్రిము తెచ్చి నా కాహారముగాఁ బెట్టుచుండెడిది. పాపము! నేను తినఁగామిగిలినది తాను తిని బ్రతుకుచుండెను.

ఒకనాఁడు ప్రభాతమునఁ జిలుకలన్నియు మేఁతకుఁ బోయినవి. పక్షిపిల్లలు గూళ్లలోఁ బడుండియుండుటచే వృక్ష ము నిశ్శబ్దముగా శూన్యమగుదానివలె నుండెను. నాతండ్రి యు నేనును అందే యుంటిమి. నా రెక్కలకు బలము వచ్చుటకి రాలేదు. అంతలో ఆకస్మికముగాఁ బెద్దకోలాహలధ్వని వినఁ బడినది. భయపడి పారిపోవుచున్నగజములఘీంకారములు, గజపోతములచీత్కారములు, గుహలలో నిద్రనుండి మేలుకొని వచ్చినసింహములగర్జితములు, ఇటునటు బరుగిడువనవరాహ ములఘుర్ఘురధ్వనులు, చెదరి పై కెగిరిపోవుపక్షులరెక్కలటప టపమనుచప్పుడులు, వనమంతయు మహాకోలాహలముగాఁ జేసినవి. ఆప్రతిధ్వని యంతకుము న్నెన్నఁడును వినియుండని దాన ను గాన గాన భయముచే వడవడవడఁకుచుఁ దండ్రిరెక్కల

నడుమ నున్నచో భయము లేదనుకొని వార్ధకమున శిథిలములగు తెక్కలలో దాఁగితిని. శబరులు వనజంతువుల నన్నిటిని వేటాడి యరణ్యమాతయు నల్లకల్లోలము గావించిరి. కొంతసేపయినతర్వాత వారా వేఁట చాలించిరి. పెద్దవర్షము కురిసి వెలిసినట్లు ఆకోలాహల మణఁగినది. నాకు భయము కొంచెము తగ్గినది. క్రింద నెట్లున్నదో చూడవలయునని వేడుక గలిగి తండ్రితెక్కలలో నుండియే కొంచె మీవలకు వచ్చి మెడ యెత్తి చూచుచుంటిని.

అప్పుడు మే మున్నచెట్టుతట్టునకు వచ్చుచున్న శబరసైన్యము చూచితిని. కొండవిదయ్యములవలె భయంకరాకారులయినవారినడుమ సేనాధిపతి యుండెను. వాఁడు యమునియపరావతారమే. శబరసేనాపతి యలయిక తీర్చుకొనుటకై మే మున్నచెట్టుమొదట విశ్రమింప వచ్చి కొంచెముసే పుండి వేఁటకొఱ కెక్కడకుఁ బోయెను. వారిలో వృద్ధశబరుఁ డొకఁడు ఆవృక్షమూలముననే కూర్చుండి యుండెను. శబరసేనాపతి వెడలిపోయినతర్వాత నావృద్ధు పైకిఁ జూచెను. దానితోనే మాప్రాణము లెగిరిపోయినవి. వాఁడు దయాశూన్యుఁడు. వానికి దుష్కర మేమున్నది. అంతయెత్తుచెట్టును అవలీలగా మెట్లమీఁదనుండి మేడ యెక్కినట్లు ఎక్కి చిన్నచిన్న చిలుకపిల్లలను పండ్లు రాలఁగొట్టినట్లు తొఱ్ఱలనుండియు, గొమ్మలనుండియు, కొమ్మలమొనళ్లనుండియు తీసి క్రిందఁ బడవైచెను.

కొని మెడ నులిమి చంపి పడవైచెను. నాతండ్రి యాతనిఁ జూచి యనివార్యమగు నుపద్రవము సంభవించినందులకు మహాభయము నొంది గజగజవణఁకుచుఁ జేయునది లేక మరణభయ మొందుచు నాయందున్న ప్రేమచేత నన్ను రక్షించుటకు మార్గ మేమని యాలోచించి సాధనాంతర మేదియు లేక తనయుండెల్ల క్రింద నన్నుఁ బెట్టుకొనియుండెను ఆక్రూరుఁడు క్రమముగా మే మున్నచోటికి వచ్చి నాతండ్రిమీఁదికి వాము వడగవలెఁ దనయొకమచేయి చాఁచి నాతండ్రి చేఁతనగు నంతవఱకు వానిచేతిపై ముక్కుతోఁ బొడిచెను. కాని యది వానికి లెక్కయా? నాతండ్రి మొఱ్ఱో మొఱ్ఱోయనట్లు కూయుచుండ నాక్రూరుఁడు మెడనులిపి చంపి క్రిందఁబడవైచెను. నాశరీరము చిన్నదగుటచేతను, అందును భయమున ముణిఁచికొనియుండుటచేతను, ఇంతకును నాకాయుస్సు కొంచెము మిగిలియుండుటచేతను ఆతఁడు నన్నుఁ జూడనే లేదు. నేను నాతండ్రికాళ్లనడుమఁ జిక్కుకొని వానిదేహముతోఁ పాటు క్రిందఁబడితిని.

నే నాదెబ్బతోఁ జావవలసినదే కాని, గాలిచేత నొకచోటఁ బ్రోగుపడ్డ యెండాకులగుంపుపైని పడితిని. నాశరీరమున కేమియు దెబ్బ తగుల లేదు. శబరుఁడు చెట్టునుండి దిగి వచ్చుటకుముందే నారంగు ఆయాకులరంగుతో సమానముగా నే యుండుటచేత, ఇతరులకు గుర్తుపట్ట వీలులేకుండఁగా

బడుచు లేచుచు జన్మసహజమగు మరణభయముచేత నెట్టెట్లో మృత్యుముఖమునుండి తప్పించుకొనుటకు నక్కడ నున్న తమాలవృక్షమూలమునకుఁ జేరితిని.

నాప్రాణములు రక్షించుకొనువాంఛచే నన్నుఁ బెంచి పోషించినతండ్రిని మరణకాలమున దగ్గఱనుండక విడిచిపెట్టి కృతఘ్నుఁడనయి దూరముగఁ బోయితిని. అంతలో నాక్రూరుఁడు చెట్టు దిగి, క్రిందఁబడియున్న పక్షులను నేఱుకొని శబరసేనాపతి పోయినదిక్కునకే పోయెను. నాకు మరణభయము తప్పిన దనుకొంటిని. పితృమరణమునఁ గలిగినదుఃఖ మధికమయ్యెను. ఆశోకమున హృదయము శుష్కించినది. అంతయెత్తునుండి పడుటవలనఁ గలిగినబాధ అప్పుడు తెలిసినది. దప్పిక యధికమయి నోరెండిపోయెను. వేఁటకాండ్ర కలకలధ్వని వినుపించుట మానినది. వారు దూరముగాఁ బోయిరని నిశ్చయించుకొని మెల్లఁగాఁ జేయి పై కెత్తి భయచంచలమగు దృష్టితో నలుదిక్కులు చూచి గడ్డిపోఁచ కదలినను ఆక్రూరుఁడు వచ్చుచున్నాఁడేమో యని బెదరుచుఁ బయికి వచ్చి అక్కడనుండి నీరు దొరకుచోటికిఁ బోవ యత్నించితిని. ఎగురుటకు ఱెక్కలు రాలేదు. కాలు నిలిపి నడవ లేను. పొరగిలఁ బడుచు లేచుచు, అష్టముగాఁ బడిపోయినప్పుడు ఒకఱెక్కతో నానుకొనుచు నేలపయి నీడ్చుకొనుచుఁ బోవుటచేత నాపలికి శ్రమ మధికముగా నుండెను. ముఖము పయి కెత్తి నిట్టూర్పు

విడుచుచుఁ జాఁకుచుఁ గోటుచున్న నాకష్టావస్థ భరింప శక్యముగాకుండెను. ఎంతకష్టములలో నున్నను ప్రాణులకు జీవితాపేక్ష విడువఁజాలరుగదా. వారికి మున్న నంత తీపి. అంతకంటెఁ బ్రియమైనది లేదు.

నన్నుఁ బ్రసవించి నాతల్లి మృతురాలయినప్పటినుండియుఁ బలుపాట్లు పడి వార్ధకదశలో నన్నుఁ బెంచినందులకైన విశ్వాసము దలపక కృతఘ్నుఁడ నయితిని. ఆతనివెంట మృతి నొందక బ్రతికియుంటిని. జీవితాశ ఎట్టివారినైనను జేయించును. ఇట్టియవస్థలో నిరు ద్రాగి ప్రాణముల నిలఁబెట్టుకొనవలయు ననితోఁచినది. అజలమైనను దుర్లభమే. సరస్సు కొంచెము దూరముగా నున్నది. అప్పుడు పద్మపరిమళము గొట్టెను. సారసపక్షుల కలధ్వని వినిపించెను. మహాకష్టదినము సంప్రాప్తమయినది. సూర్యుఁ డాకాశమధ్యమునను నకు వచ్చినాఁడు. ఎండ తీవ్రముగాఁ గాయుచున్నది. నోరెండిపోవుచున్నది. "కటకటా! దిక్కు లేదే కన్నులు చీఁకట్లు క్రమ్ముచున్నవి. నాకిప్పుడు ఇక్కడఁ జావు వ్రాసిపెట్టినాఁడు కాఁబోలు విధి. ఏమి చేయుదు" అని ఆలోచించుచుండఁగా ఆసమీపాశ్రమమున నుండు మునికుమారుఁ డొకఁడు కొందఱు ఋషిపుత్రులతో స్నానార్థము సరస్సునకుఁ బోవుచుండెను. ఆతఁడు జాబాలికుమారుఁడు. హారీతుఁ డని యతనిపేరు.

సజ్జనచిత్తము లకారణమిత్రములు, దయార్ద్రములు

"నేను స్నానమునకు వెడలినపుడు ఆసరస్తీరమున నిది పక్షి యున్నది. అక్కడ నున్న చెట్టుపై నున్న గూటినుండి జాఱిపడి యుండును. ఎండచేత నులనుల మాడిపోవుచుండెను. చావునకు సిద్ధమై తుదిప్రాణముతో నుండెను. నాకు దీనియవస్థ చూడఁ గనికరము గలిగినది. దాని గూటిలోఁ జేర్పఁ దలఁచినచో ఆచెట్టు మే మెవ్వరము నెక్కలేనంతయెత్తుగా నున్నది. కావున నిక్కడకుఁ దెచ్చితిని. దీనికి ఱెక్కలు వచ్చినంతయుం తటఁ దాను తనయిచ్చవచ్చినచోటికిఁ బోవఁగలుగువఱకు మనయాశ్రమవృక్షకోటరములో నుంచి మునికుమారులు నీవారధాన్యపుగింజలతోను ఫలరసములతోను బోషింపఁ దగును. ఎవరి కయినను అనాథపరిపాలనముకంటెఁ బరమధర్మము లేదు గదా." అని యిట్లు నన్ను గుఱించి చెప్పుచుండఁగా [illegible]తండ్రి యగు జాబాలి మెడ వంచి నావైపునకుఁ జూచి చిరకాలమునకుఁ జూచినవానిని మొదట గుర్తుపట్టలేక కొంతసేపటికి గుర్తుపట్టినవానివలె మరల మరలఁ జూచి "తన యవినయఫలము తానే యనుభవించుచున్నది." అనియెను.

ఆమహాత్ముఁడు తపఃప్రభావమున భూతభవిష్యద్వర్తమానకాలములందలిస్థితిగతు లెఱుఁగును. దివ్యదృష్టిచే జగత్తు లన్నియుఁ గరతలామలకమువలెఁ జూడఁ గలఁడు. గతజన్మవృత్తాంతములు, రాఁబోవుజన్మమందలివిషయములును జెప్పఁగలఁడు. ఆతనిప్రభావ మామును లెల్లను నెఱుఁగుదుము

గాన నాచరిత్రము విన( గుతూహలపడి "ఇది యేమి యవి
నయము చేసినది? దీనివృత్తాంత మేమి? సెలవి" మ్మని
జాబాలిని( బ్రార్థించిరి.

జాబాలి వారిప్రార్థనమున కంగీకరించి "ఈచరిత్ర
మిగుల( బెద్దది. పొద్దు తక్కువగా నున్నది. మీకును
స్నానసమయము గావచ్చినది. దేవతార్చనవేళ దాటిపోవును.
కావున మీరుగూడ లేచి మాపటి స్నానహోత్రకార్యములు నిర్వ
ర్తించుకొని ఫలమూలభక్షణ చేసి రండు. సావకాశముగా(
గూర్చుండి వినవచ్చును. దీనిక(గూడ నాహారము పెట్టి యాల
యిక దీర్చుడు. నేను కథ చెప్పునపుడు నీ జన్మాంతరవృ
త్తాంతమును స్వప్నవృత్తాంతమునువలె స్మరింప(గలదు" అని
చెప్పి, జాబాలి మునులతో(గూడ లేచి స్నానకృత్యములు నెర
వేర్చుకొనెను.

రాత్రి నాల్గుగడియలకాల మైనతరువాత వెన్నెలలో
నొకవేత్రాసనమున జాబాలి కూర్చుండ శిష్యు(డు విసనకఱ్ఱ
తో విసురుచుండెను. హారీతుడు నన్ను( దీసికొనివెళ్ళి తం
డ్రితో "జనకా! ఈశుకమునకు నలయిక దీరినది. దీని
వృత్తాంతము చెప్పుము." అని ప్రార్థింప నతడు నన్ను( గల
య(జూచి, సభ్యులశ్రవణాసక్తి తెలిసికొని "మీ కంతకుతూ
హల మున్నచో వినుడు చెప్పెదను." అని యిట్లు చెప్ప(
దొడ(గెను.

౨

"సకలలోకములకు నలంకార మగునుజ్జయినీపురము సుప్రసిద్ధమేకదా. అది సర్వవిధములను స్వర్గమునుమించినది. మహాదేవుఁడు కైలాసమును విడిచిపెట్టివచ్చి మహాకాలుఁడను పేర నచట వెలసియున్నవాఁడు. ఆపురమున నివారితప్రజాపీడుఁ డగుతారాపీడుఁ డనురాజు నివసించుచుండెను. అతఁడు తనపరాక్రమమున సమస్తరాజమండలమును పాదాక్రాంతము గావించుకొనెను. సకలనీతిశాస్త్రరహస్యములు నెఱిఁగి ప్రజాసుఖమే ముఖ్యముగా నేర్పఱచుకొని రాజ్యము చేయుచుండెను. శుకనాసుఁ డనుముఖ్యమంత్రికి సమస్తరాజ్యభారము నప్పగించి ప్రజల నందఱ సుఖవంతులఁ గావించి చేయవలసిన రాజ్యకార్యవిశేషము లేవియు లేకుండుటచే యౌవనసుఖమనుభవించుచు వినోదములతోఁ గాలము గడపుచుండెను. ఆతఁడు సమస్తసుఖములు ననుభవించెను గాని పుత్త్రసుఖము మాత్ర మాతనికి లభింపలేదు. యౌవన మతిక్రమించినది. సంతతిసుఖము లేకపోవుటచే నాతనికి నితరసుఖములందు రోఁత గలిగినది. అంతియేకాక విచారముకూడఁ గలిగినది. "ఎంతయైశ్వర్య మున్ననేమి? ఎంతబలఁగ మున్ననేమి? ఎంత సుఖ మున్ననేమి? అపత్యశూన్యునిబ్రతుకు కంతయు శూన్యమే" యని యాతఁడు దుఃఖించుచుండెను.

ఆతనిపట్టమహిషి యగువిలాసవతి విలాసవతియే. ఆమె

సుశీల. ఎని విలాసములున్న నేమిలాభము? ఎంతసంపదయు న్న నేమిప్రయోజనము? "గొడ్రాలిబ్రతుకు బ్రతికితి" నని యామె మహాదుఃఖ మనుభవించుచుండెను.

ఒకనాఁడు రాజు దేవిని జూడ నంతఃపురమునకుఁబోవఁ గంచుకు లందఱును దుఃఖించుచుండిరి. పరివారజనము శోక మూక మయ్యె. కొందఱు స్త్రీలును అంతఃపురపుఁబెద్దలును రాణి నోదార్చుచుండిరి. కన్నీరు కాలువలుపాఱ రాజ్ఞి దుఃఖించుచుండెను. ఆతనిరాక చూచి రాణి ప్రత్యుత్థానముచేయు రాజు దగ్గఱకువచ్చి యామంచముమీఁదనే కూర్చుండి "దేవీ! నీ వింతదుఃఖించుటకు గారణమేమి? ఈకన్నీ రేల? దుఃఖకారణ మేమో చెప్పుము. నే నేమైన నీవిషయమునఁ దప్పుచేసితినా? నాభటు లేమైనఁ దప్పుచేసిరా? ఏకార్యుఁడైన నిన్నుఁ బరాభవించెనా? చెప్పుము. నేనును, నారాజ్యమందలివారును నీయధీనులమేకదా!" అని యెన్నివిధముల నడిగినను చెప్పక దుఃఖించుచున్న భార్యను 'దుఃఖింపకు' మని యోదార్చి పరివారజనమును 'దుఃఖకారణము మీ కేమయినఁ దెలియునా' యని యడిగెను.

తాంబూలకరండవాహిని యగుమకరిక 'దేవ! మీ రెన్నఁడును దేవికి వ్యతిరేకముగాఁ బ్రవర్తింపలేరు. ప్రవర్తింపరు. తమరనుకూలు రయియున్నపుడు వ్యతిరేకముగా ప్రవర్తింప నెవఁడు సాహసించును? అట్టిదేదియుఁ గాదు. సంతతి

లేమిచే విఫలజన్మురాల నయితి నని దీక్షాకాలమునుండి విచారించుచుండెను. నేఁడు మాసచతుర్దశి గాన నీశ్వరారాధనము సేయ మహాకాలాలయమునకుఁ బోయి శివార్చనము చేసి, అచట నొకఁడు భారతము పురాణము చెప్పుచుండగా నొకని మిషము కూర్చుండి వినుచుండెను. పురాణసందర్భమున 'అపుత్రిస్య గతి ర్నాస్తి' అనియు 'పున్నామనరకమునుండి రక్షించువాఁడు పుత్త్రు' డనియు, పుత్త్రుఁడు లేనిబ్రతుకు వ్యర్థమనియు నాతఁడు చెప్పెను. అది విని దేవి మనమునఁ బుట్టిన దుఃఖము పట్టఁజాలక వెంటనే యింటికి వచ్చి దుఃఖించుచున్నది' అని చెప్ప రాజు నిట్టూర్పు విడిచి యిట్లనియెను.

"దేవి! దైవాధీనమగు విషయమున మన మేమి సేయఁగలము? మనకుఁ బుత్త్రాలింగనసుఖము ప్రాప్తము లేదు. జన్మాంతరమున నట్టిసుఖ మిచ్చు సుకృతము చేసికొనలేదు. జన్మాంతరకృతకర్మములఫల మీజన్మమున ననుభవింపవలయును గదా! దైవసంకల్ప మన్యథా సేయ నెంత తెలివిగలవారికైనను శక్యము కాదుగదా! అయినను మానుష్యశక్తిలో నున్నంతవఱకు యత్నము చేయుదము. గురుభక్తియు దేవతాభక్తియు ద్విగుణము సేయుము. ఋషీశ్వరసేవ సేయుచుండుము. వారివరప్రసాదమున దుర్లభకార్యములు కూడ సిద్ధించు నని పురాణములలో విందుము. మున్ను చండకౌశికానుగ్రహమున మగధరా జగు బృహద్రథుఁడు జనార్దనుని జయించినంత సా

మర్థ్యము గల జరాసంధుఁ డను పుత్రునిఁ బడసెను. ఋశ్య శృంగానుగ్రహమున దశరథుఁడు వార్ధకదశలో నలువురఁ బుత్రులఁ గనలేదా? నాకుమాత్రము దుఃఖము లేదా. నాకొక్కొక్కపుడు జగత్తంతయు శూన్యముగాఁ గనఁబడును. జన్మము వ్యర్థ మని తోఁచును. మనము ధైర్యమును ధర్మమును విడువక చరింపవలయును. ధర్మబుద్ధియే సర్వసంపదలకు మూలము." అని బోధించి యోదార్చి యామె యనుమతి గైకొని వెడలెను. రాజ్ఞియు భర్తయుపదేశమున ధైర్య మవలంబించి ధర్మకార్యము లాచరించుచుండెను.

ఇట్లు కొంత కాలము గడవఁగా, ఒకనాఁడు తెల్లవాఱుకముందు విలాసవతినోటిలో సంపూర్ణచంద్రుఁడు ప్రవేశించినట్లు తారాపీడునకు స్వప్నములోఁ గనఁబడెను. అతఁడు మేలుకొని సంతోషముతో వెంటనే శుకనాసునిఁ బిలిపించి స్వప్నవృత్తాంతము దెలిపెను. అతఁడును మిగుల సంతసించి "దేవా! మనకు మంచిదినములు వచ్చినవి. మనమనోరథములీడేఱనున్నవి. కొలఁదికాలములోనే పూర్ణచంద్రబింబసమమగు పుత్త్రముఖము మీరు చూడఁగలరు. నాకును ఆసమయమునసే మంచిస్వప్నము వచ్చినది. తెల్లని వస్త్రములు ధరించిన బ్రాహ్మణుఁ డొకఁడు కనఁబడెను. ఆతనియాకృతి దివ్యాకృతి. అతఁడు శాంతమూర్తి. ఒకపుండరీకము దెచ్చి నాభార్య తొడపై నుంచినట్లు నాకుఁ గలలోఁ గనఁబడినది. భావి

సుఖములను స్వప్నములు సూచించు నందురు. తెల్లవాఱునపుడు వచ్చుస్వప్నములు శీఘ్రఫలసూచకములు. ఇంతకంటె మన కానందకారణ మే మున్నది? అచిరకాలముననే మాంధాతృచక్రవర్తినిం బోలు కుమారుఁడు దేవికిఁ బుట్టును. మీ వంశ మవిచ్ఛిన్నసంతతి యగు" నని పలుకుమంత్రిచేయి పట్టుకొని యాతని వెంటఁబెట్టుకొని యంతఃపురములోనికిఁ బోయి తమస్వప్న వృత్తాంతములు సెప్పి విలాసవతి నానందింపఁ జేసెను.

మఱికొన్ని దినములకు విలాసవతికి గర్భిణీచిహ్నములు గనఁబడినవి. పరివారజను లవి గ్రహించి తగినయుపచారములు చేయుచుండిరి. కులవర్ధన యనుపరిచారికవలన రాణి గర్భిణి యని విని స్వప్నవృత్తాంతములో సత్య మున్న దని రాజమంత్రు లిరువురు ననుకొనుచు శుభసమయమున రాణిని జూడ వెడలిరి. గర్భవతీవిలాసభాసిత యగువిలాసవతినిఁ జూచి చెలికత్తెహస్తము కుడిచేతితోఁ బట్టుకొని యెడమచేయి మోఁకాలిమీఁద నానుకొని తొందరతో లేవఁబోవువిలాసవతిని రాజు 'వలదు, లేవవలదు' అని దగ్గఱకు వెడలి యామెతోఁ గూడ నాప్రక్కమీఁదనే కూర్చుండెను. శుకనాసుఁడు రాజాజ్ఞచేఁ బ్రక్క నున్న బంగారపుఁగోళ్ళమంచముమీఁదఁ గూర్చుండెను. రాజు గర్భిణి యగురాణినిఁ జూచి సంతోషాతిశయము నొంది పరిహాసముగా "దేవి! కులవర్ధన చెప్పినమాటలలో నిజ మేమైన నున్నదా? అని శుకనాసుఁ డడుగుచు

న్నాఁడు." అనియెను. రాణి సిగ్గుచేత నేమియు మాటాడక ముఖమువంచుకొని యుండ రాజు మరల మరల నదే యడుగ "ఏమది. అతిమాత్రముగా నన్ను సిగ్గుపఱచుట. నేనేమియు నెఱుఁగను." అని కోపముతోఁ జూచినట్లు చూచెను. శుకనాసుఁడది గ్రహించి లోలోపల నవ్వుకొనుచు "దేవా! దేవి కంతయిబ్బంది యేల కలిగించెదవు? ఆమె సిగ్గుపడుచుండుట గ్రహించితివిగదా. ఆప్రసంగము కట్టిపెట్టుము" అని చెప్పి రాజుతోఁ గొంతసేపు కాలక్షేపముచేసి సెలవుపుచ్చుకొని నిజగృహమున కరిగెను. రాజారాత్రి దేవీగృహముననే యుండెను. క్రమముగా గర్భదోహదములు చేసిరి. ఆమెకుఁ బ్రసవసమయము సమీపించెను. ఒకశుభసమయమునఁ బ్రసవచిహ్నములు గనఁబడ జ్యోతిష్కులు పాదచ్ఛాయలు లెక్కించి వేళ గట్టుచుండ, సూతికాగృహమునఁ బరిచారజనము సంభ్రమము నొందుచుఁ గావలసినయుపచారములు చేయుచుండ, విలాసవతి సకలలోకహృదయానందకారి యగుకుమారునిఁ గనెను.

రాజు మంత్రితోఁ గలసి వెళ్ళి యానందకారకుఁ డగు నాత్మజునిఁ జూచెను. రాజు కన్నుల నానందబాష్పము లస్డుకొన నవి తుడిచికొని మరలమరలఁ బ్రేమాతిశయముతోఁ గుమారునిఁ జూచుచుఁ దనజన్మము ధన్యమయినదని యెంచుచు నానందించుచుండెను. శుకనాసుఁడు మహానందముతో

బాలునియవయవములు పరిశీలించి " దేవ ! చిత్తగింపుము. బాలునియవయవములందు చక్రవర్తిచిహ్నము లున్నవి. మూడు చేతులలోనిశంఖచక్రచిహ్నములును. పాదములలోనిధ్వజరథతురగాతపత్రచిహ్నములు కనఁబడును. కాక వానిరోదనధ్వని దుందుభిధ్వనివలె నెంతగంభీరముగా నున్నదో" అని శుకనాసుఁడు చెప్పుచుండఁగా మంగళకుఁడను పురుషుఁడు సంతోషవికసితముఖముతో రాజుసన్నిధికి వచ్చి రాజపాదములపైఁబడి " మహాప్రభూ ! దైవానుగ్రహమున శత్రువు లందఱును హతులైరి. తమయనుగ్రహమున శుకనాసునిపెద్దభార్య యగుమనోరమకుఁ గుమారుఁడు కలిగెను " అని చెప్పెను. అతఁడామాటలు విని " ఏమి ! శుకపంజర ! సంపదవెంట సంపద వచ్చు ననుమాట యెంత సత్యమే " అని నిర్భరానందముతో శుకనాసునిఁ గౌఁగిలించుకొని నవ్వుచుఁ * బూర్ణపాత్రముగా శుకనాసునియుత్తరీయము దానే లాగికొనెను. అశుభవార్త చెప్పినపురుషునకుఁ బెద్దపారితోషిక మిమ్మని యాజ్ఞ చేసెను. రాజు పరివారజనముతోను రాజవర్గముతోను శుకనాసుని వెంటఁబెట్టుకొని శుకనాసునిగృహమునకుఁ బోయి మహోత్సవము చేయించెను.

అంతఁ బదియవదినమున శుభవేళ రాజు సువర్ణాదిదాన

* పూర్ణపాత్రము=సంతోషసమయమున తెలియకుండఁగ మిత్రులు లాగికొను వస్త్రాభరణాదులు.

ముఁబు చేసి నాకు స్వప్నములో దేవిముఖమునఁ జంద్రుఁడు ప్రవేశించినట్లు గనఁబడినది. గాన వత్సుఁ జంద్రాపీడుఁ డని నామకరణము చేసెద నని పెద్దలతోఁ జెప్పి వారియనుమతిని నట్లు నామకరణము చేసెను. మఱునాఁడు శుకనాసుఁడు జాతకర్మసంస్కారము గావించి రాజానుమతిని బ్రాహ్మణోచితమగు వైశంపాయనుఁ డనుపేరు పెట్టెను. పిల్లలిద్దఱును శుక్లపక్షచంద్రునివలె దినదినాభివృద్ధి గాంచుచుండిరి. క్రమక్రమముగాఁ జంద్రాపీడునకు శైశవము ఆటలతోఁ గడచెను. కుమారుని కాటలమీఁద దృష్టి మరలించి విద్యపయి నాసక్తి గలిగింపవలయు నని విద్యామందిర మొకటి నిర్మింపఁదలఁచి పురమునకు వెలుపట నరక్రోసుదూరమునఁ జుట్టును అగాధమైన యగడ్త, ఎత్తైన బహిఃప్రాకారము, లోపల నుపప్రాకారములు, వాహ్యాళికి గావలసినంత ప్రదేశము, క్రింది భాగమున వ్యాయామశాల, ధృఢమయిన తలుపులు, పెద్దప్రవేశద్వారము గలుగునట్లు విద్యామందిర మొకటి నిర్మింపఁ జేసి సర్వవిద్యలకు నాచార్యులను సంపాదించి వారి నంకుంచెను.

శుభదినమునఁ జంద్రాపీడ, వైశంపాయనుల నాచార్యుల కప్పగించిరి. దాసదాసీజనమును నిషేధించి యాచార్యకుల పుత్రప్రాయులగు పరిజనుల నియమించి క్రీడామిత్రుల నక్కడకు రానీక పంజరములోనుంచిన సింగపుఁబిల్లవలె నాతని విద్యామందిరమున నుంచెను.

చంద్రాపీడున కప్పుడాఱవయేఁడు. రాజద పక్షులు ప్రతిదినము ప్రాతఃకాలమున లేవఁగానే పరిమితపరివారజనముతో విద్యామందిరమునకుఁ బోయి పూటను గడిపెడువాఁడు. చంద్రాపీడున కితరదృష్టి లేకుఁగాన క్షణములోఁ జెప్పినది గ్రహించుచుండువాఁడు. గురువులు వాని తెలివియు శ్రద్ధయుఁ జూచి మిగుల నుత్సాహముతో విద్య చెప్పుచుండెడివారు. నిర్మలమగు నద్దములోఁ బ్రతిబింబము స్ఫుటముగా నంటునట్లు చంద్రాపీడుని హృదయమున విద్యలన్నియు స్ఫుటముగా నాటినవి. ధనుర్విద్యయందు, శస్త్రాస్త్రవిద్యలయందు, గజారోహణాశ్వారోహణములందు, రథచోదనమందు, వేణువీణాదివాద్యములయందు, నృత్యాభినయాదికళలందు, చిత్రకళయందు, ఇంద్రజాలవిద్యయందు, నాటకములందు, భారతాదీతిహాసములయందు, రామాయణాదికావ్యములయందు, సర్వలిపులయందును, సకలదేశభాషలయందు, ఇందునందు ననవేల? సకలశాస్త్రములందు సకలకళలయందు నైపుణ్యము నతఁడు సంపాదించెను. వ్యాయామవిశేషములలో సహజయుద్ధశ్రమము నభ్యసించుచు చంద్రాపీడునకు భీమునకువలె మహాప్రాణశక్తి గలిగినది.

దాన నాతఁడాటగా గజసింహాదుల చెవి పట్టుకొన్నచో నవి నిలిచిపోవలసినదే. కదలలేవు. మెదలలేవు. పిడికిటిపోటు దెబ్బతోఁ దాటిచెట్లను తామరకాడలవలె ముక్కముక్కలు సేయుచుండువాఁడు. పరశురాముని బాణమువలె నాతని

బాణములు పర్వతశిఖరముల భేదించుచుండెడివి. పదిమంది మోయఁదగిన యినుపదండముతో వ్యాయామమున శ్రమము చేయుచుండెడివాఁడు.

ఆమహాప్రాణశక్తి తక్కఁ దక్కినవిద్య లన్నిటిని వైశంపాయనుఁడు చంద్రాపీడునితో సమముగా నేర్చుకొనెను. రాజకుమారున కాతనియెడల విశ్వాసపాత్రుఁడగు మిత్రుఁ డను భావము గలిగెను. క్షణమాత్రమైనను నాతనిని విడిచి యుండలేఁడయ్యె. వైశంపాయనుఁడును ఉత్తమమైత్రితో రాజకుమారు నెడఁబాయకుండెను. వారిమైత్రి వారితో పాటు వృద్ధిఁ బొందుచుండెను. ఇట్లు విద్యామందిరమున విద్యాభ్యాసము చేయు రాజకుమారునకుఁ బదియాఱవవత్సరము వచ్చెను. యౌవనారంభ మయ్యె. "చంద్రాపీడునికి విద్య లన్నియుఁ బరిపూర్ణము లయినవి గాన నింక విద్యామందిరమున నుండ నక్కఱలే" దని యాచార్యులు దెలుపఁ దారాపీడుఁడు చంద్రాపీడునిఁ దీసికొనివచ్చుటకై వలాహకుఁ డనువానిఁ బంపెను. అతఁడు రాజకుమారునిసన్నిధి కరిగి "కుమార! సర్వవిద్యలును సకలకళలును సంపూర్ణములయినవి గాన నిన్ను రాజగృహమునకుఁ దీసికొనివెళ్లవచ్చు నని యాచార్యులు సెలవిచ్చిరి గాన రాజులును ప్రజలును, మేమును, మీతల్లియు విద్యావంతుఁడ వగునిన్నుఁ జూడఁ గుతూహలపడుచున్నారము మా కందఱకును దర్శన మిచ్చి యథేచ్ఛముగాఁ బురమున సంచ

రించి పరిజలనేత్రములు ధన్యములు సేయుము." అని మహా రాజు సెలవిచ్చి యింద్రాయుధ మనునొక గుఱ్ఱమును నీకై పంపెను. అది ద్వారమున నున్నది. అది పారసీకాధిపతిచే సముద్రమున దొరకఁగా మహారాజునకుఁ గానుకగా నర్పిం చెను. తర్వాత నశ్వలక్షణవేత్తలు దానిలక్షణములు చూచి యిది యింద్రాశ్వమువంటిది అనిరి. అది దేవరయారోహించుట కై మహారాజు పంపె" నని చెప్పెను.

చంద్రాపీడుఁడు తండ్రియాజ్ఞను శిరసావహించి వెళ్లఁ దలఁచి మేఘగంభీరవాక్యములతో "ఇంద్రాయుధము నిచ్చో టికిఁ గొనిరమ్ము" అనియెను. అంత నతఁడు గుఱ్ఱమును దీసి కొనిరాఁగా దానిలక్షణము లన్నియుఁ బరికించి రాజకుమా రున కాశ్చర్యము గలిగెను. "ఇది సామాన్యాశ్వము గాదు. ఏశాపవశముననో యశ్వజన్మ మెత్తిన యేదివ్యవ్యక్తియో. మున్ను స్థూలశిరుఁడను మహాతపస్వి రంభయనునప్సరసను శపింపఁగా ఆమె యశ్వహృదయ యనుపేరితో నాఁడుగుఱ్ఱమై శతధన్వుఁ డనురాజును సేవించుచు చిరకాలము భూలోకమున నుండెను గదా. ఇదియు నట్టిదే యని యనుకొని యెక్కవలయు నను తలఁపుతో గుఱ్ఱముదగ్గఱకువచ్చి "మహాత్మా! అశ్వరూపమున నున్న నీ వెవరవో నాకుఁ దెలియదు. నీపై నారోహణము చేయుచున్న నాతప్పు క్షమింపుము." అని మనమున ననుకొన నాయశ్వ మాతని యభిప్రాయము తెలిసికొని సమాధాన

జూచు చూపునంతలో నాతఁడు “నా రమ్ము కుమారా!” యని యానందబాష్పములు కన్నులఁ గ్రమ్మ నోష్ఠము గదుర్పాటు గలుగ లేచి కుమారునిఁ గౌఁగిలించుకొనెను. తండ్రి గాఢాలింగనసుఖ మనుభవించి విడిచినతర్వాతఁ గుమారుఁడు పితృపాదసన్నిధినిఁ గూర్చుండఁబోవఁ దనతాంబూలకరండవాహిని యుత్తరీయపుఁజెఱఁగుతో నచ్చటి నాసనముగాఁ బఱవ “వలదు తీసివేయు” మని మెల్లగాఁ జెప్పి యది కాలఁ ద్రోసివైచి నేలపైఁ గూర్చుండెను.

మహారాజు వైశంపాయనునిఁ గుమారునివలెనే కౌఁగిలించికొని ప్రక్కనున్న యాసనముపయిఁ గూర్చుండుమని సన్న చేసెను. కొంచెముసేపయినతర్వాత “నాయన్నా! మాతల్లిని మిగిలినయంతఃపురమువారిని, పౌరజనమును దర్శనదానమున సంతసపెట్టుము.” అని చెప్పఁగానే మరల సెలవు పుచ్చుకొని యంతఃపురప్రవేశయోగ్యములగు పరివారముతో వైశంపాయనసహాయుఁడై యంతఃపురమునకు వెళ్ళి తల్లికి నమస్కారము చేసెను.

ఆమె సంభ్రమముతో లేచి యాలింగనము చేసికొని శిరమును మూర్కొని యానందమంది వైశంపాయనుని గౌఁగిలించుకొని తాను తనపీఠముపైఁ గూర్చుండి నేలపయిని గూర్చుండఁబోయినకుమారుని బలాత్కారముగా దగ్గఱకుఁ దీసి తన తొడపయిని గూర్చుండఁ బెట్టుకొనెను. తొందరగాఁ బరివార

తొందరతో లేచి యెదురుగను వచ్చి రాజకుమారు నాలింగన
ముచేసికొని రత్నాసనముపయిని గూర్చుండఁ బెట్ట యత్నించి
నను నాతఁడు గూర్చుండక నేలపైఁ గూర్చుండెను. శుకనాసుఁ
డు వైశంపాయుని గౌఁగిలించుకొని యనంతరము రాజకుమారుని ప్ర
క్కను గూర్చుండెను. శుకనాసునందక్క గలిగిన వారందరు
ను తమపీఠములను వదలి నేలమీఁదనే కూర్చుండిరి. శుకనా
సుఁడు సంతోషపారవశ్యముతో " చంద్రాపీడ! నేఁడుగదా
మీతండ్రి జన్మము సఫలమయినది. నాయనా! నీవంటివాఁ
డు పుత్రుఁడగునా! మీతండ్రితోఁ గలసి భూభారము వహిం
పుము. భూదేవికి పుణ్యఫలాలుం బట్టినది లేకున్న నీవంటి
వాఁడు రాజగుట సంభవించునా " యని స్తుతించి మాలతీ
తిని కుసుమాంగరాగాభరణాదులతో గౌరవించెను
చంద్రాపీడుఁ డాతనియొక్క సెలవుపుచ్చుకొని శుకనా
సునియంతఃపురమున కరిగి మనోరమను జూచి యామెయొసఁగు నాదరా
శీర్వాదములు వడసి మరల నింద్రాయుధ మెక్కి రాజకుమా
రుఁ డుండుటకు నేర్పఱచిన భవనమునకుఁ బ్రవేశించి రాజవర్గము
తో వచ్చుటనే మజ్జనభోజనాదికార్యములు నిర్వర్తించుకొనె
ను. తాను బరుండుటకేర్పడినచోటనే యింద్రాయుధమును
గట్ట నేర్పఱిచెను. ఆదినమంతయు నట్టియుత్సవములతోఁ గడచి
నది. అంత సూర్యాస్తమయ మయ్యె. రాజకుమారుఁడు మరల
రాజగృహమునకుఁ బోయి జనకులదర్శనము చేసి కొంచెమునే

పక్కడకుండి వారి నానందింపఁజేసి తనభవనమునకు వెడలి పరుండెను.

ఒకనాఁడు ప్రాతఃకాలముననే కైలాసుఁడను కంచుకి యొకకన్యకను వెంటఁబెట్టుకొని రాజకుమారదర్శనమునకు వచ్చెను. ఆమె సౌందర్యవతి. యౌవనారంభదశలో నున్నది. ఆమె దిరిపుకుసుమరంగుగల మేలిముసుఁగు ధరించినది.

"రాజకుమారా! మహాదేవిగారి యాజ్ఞ చిత్తగింపుము." "మహారాజు పూర్వము కులూతదేశము జయించి వచ్చినపుడు స్త్రీపాలకబృందములో నీకన్యకను దీసికొనివచ్చి యంతఃపురపరిచారికామధ్యమున నుంచెను. ఈమెసౌందర్యములను సుగుణములును జూచి యీమె కులూతదేశాధిపతికూఁతు రయి యుండునని యెంచి ప్రేమతోఁ బుత్రికవలెఁ బెంచితిని. పత్రలేఖ యని యీమెపేరు. నీకు అడపకత్తెగా నేర్పఱచుకొనుము. పుత్రికగాఁ బెంచితిని గాన నీమెయందలిపక్షపాతమునఁ జెప్పుచున్నాను. విశ్వాసపాత్రురాలు. ఈమెయే నీకు సర్వోపచారములు సేయును. బాల్యముచేతఁ గొంచెములోపము లున్నచోఁ జెప్పి సేవ చేయించుకొనుము." అని కైలాసుఁ డూరకుండ రాజకుమారుఁడు "జననిసెలవుప్రకారమే చేసెద" నని మనవిసేయుమని చెప్పి యాతనిని బంపివేసెను.

పత్రలేఖ యది మొదలు సర్వదా ఛాయవలె నాతనిని విడువక యుపచారములు చేయుచుండెను. చూచినది మొదలు

రాజకుమారునికూడ నీమెయందు దయగలిగినది. మిగులన మ్రికయుంచెను. ఇట్లు కొన్నిదినములు గడవఁగాఁ జంద్రాపీడు నకు యౌవరాజ్యాభిషేకము సేయవలయుననుతలఁపు గలిగి రాజు రాజ్యాభిషేకసంభారములు సంగ్రహింప నాజ్ఞచేసెను.

యౌవరాజ్యాభిషేకము నొందుటకు ముందొకనాఁడు రాజకుమారుఁడు శుకనాసునిఁ జూడఁబోవ నతఁడు "చంద్రా పీడ! నీవు సమస్తవిద్యలయందు, సకలరాజనీతులయందును పరిపూర్ణుఁడవే అయినను లోకానుభవముతుట్టి నీకుఁ గొన్ని నీతు లుపదేశింపఁ దలఁచితిని. రాజ్యాభిషేకము గాఁగానే లక్ష్మీమదము ప్రవేశించి యెంతనీతివేత్త నయినను గన్ను గానకుండఁ జేయును.

అగర్భశ్రీమంతుఁడగుట, యౌవనారంభము, సుందరా కారము, మనుష్యాతీతశక్తిగలుట అనువానిలో నొక్కొక్క గుణమే యనర్థపరంపరలోదింపును. అన్నియు నొక్కచో నున్నచో చెప్పవలసిన దేమున్నది. ధర్మవాక్యములు, గురూ పదేశములును చెవులలోఁ బడనేని జలమువలె చెవిపోటు గలి గించును. ఇచ్చకము లాడి మోసముచేసి ధన మపహరించు వారిమాట లతిప్రియముగా నుండును. హితముచెప్పువాఁడే దొరకఁడు. ఎవరైనఁ జెప్పిరేని వాడు శత్రువులవలెఁ గనఁబ డుదురు. నీవు సహజముగా ధీరుఁడవు. దానిపైని మీజనకుఁ డు సర్వవిద్యాపరిపూర్ణుని గావించినాఁడు. నీసద్గుణములే నా

చేత నింతదాఁకఁ జెప్పించినవి. సమస్తకల్యాణగుణములతోను కులక్రమాగత మగు యౌవరాజ్య మనుభవింపుము. పట్టాభిషేకానంతరము దిగ్విజయయాత్ర గావింపుము. మీతండ్రి సర్వదిగ్విజయము చేసినను నీవును జయించి రాజులను వశపఱచుకొనవలయును.'' అని యుపదేశింపఁ జంద్రాపీడుఁడు వినయముతో నవి గ్రహించి శుకనాసునియనుజ్ఞ నొంది స్వగృహమున కరిగెను.

మఱికొన్ని దినములకుఁ దారాపీడుఁడు సమస్తపుణ్యతీర్థములనుండియుఁ బవిత్రజలములు తెప్పించి సర్వౌషధులును సమస్తఫలములు సకలశ్రేష్ఠపదార్థములును తెప్పించి సుముహూర్తమునఁ జంద్రాపీడునకు యౌవరాజ్యపట్టాభిషేకము చేసెను. ఒక చెట్టు నంటియున్నతీగె యాచెట్టును విడువకయే మరియొక చెట్టుపై నల్లుకొనునట్లు రాజ్యలక్ష్మి తారాపీడుని విడువకయే చంద్రాపీడునిపై సంక్రమించెను. తల్లి యువరాజును చందనమాల్యాభరణాదులతో నలంకరించెను. యువరాజు రాజ్యసింహాసన మెక్కి సకలరాజవర్గమును బరివారజనమును సర్వరీతిని గౌరవించెను.

3

అంత దిగ్విజయ యాత్రకు దుందుభిమ్రోఁగించిరి. 'జయజయ' అనుధ్వనితో సకలభువనములు నిండిపోయినవి. ప్రయా

ణమున కలంకరించినయాఁడేనుఁగుపై నున్న యంబారీలోఁ బత్రలేఖను ముందే యెక్కించి మావటివాండ్రు తీసికొనిరాఁగా నాయేనుఁగుపై నెక్కి యువరాజు బయలుదేఱెను. పరివార మంతయు వెంటఁ బోవుచుండెను. గంధమాదనమను నశ్వము వెనుకను ఇంద్రాయుధము ముందును నడుచుచుండ, ముందు తూర్పుదిక్కును జయింప వెడలెను. వైశంపాయనుఁడు వేఱొక యేనుఁగుపై ద్వితీయయువరాజువలె ప్రక్కనుపోవుచుండెను. బలములు భూమియీనినట్లు సర్వత్ర నిండియుండెను.

జయింపవెడలిన దేశాధిపతు లందఱును వారియంతట వారే పాదాక్రాంతు లయి కానుకలును, పన్నులును తీసికొని యెదురువచ్చి సమర్పించి యాతనిదయకుఁ బాత్రులయిరి. తలయెత్తుకొని వచ్చినశత్రువులఁ దల లణఁచుచు, శరణాగతుల రక్షించుచు, భయార్తుల నోదార్చుచు, శాసనములు లిఖియించుచు, జయస్తంభములు నిలుపుచుఁ బ్రజలను రంజిల్లఁ జేయుచు నాలుగుదిక్కులను జయించెను. మూఁడు సంవత్సరము లాదిగ్విజయయాత్రలోఁ గడచినవి.

యువరాజు సకలభువనతలమును జయించి భూమి ప్రదక్షిణము చేయుచుఁ గైలాససమీపమున సంచరించు హేమజటులను కిరాతులకు నివాస మగు సువర్ణపురమునకుఁ బోయి యది జయించి వశపఱచుకొని విశ్రాంతికై కొన్నిదినము లచట నుండెను.

ఒకనాఁ డింద్రాయుధము నెక్కి యొంటరిగా వేటకుఁ బోయి యచట నొకపర్వతశిఖరమునుండి దిగివచ్చుచున్నకిన్నర మిథునమును జూచెను. అట్టివారిని మున్నెన్నఁడు చూడలేదు గాన వారిదగ్గఱకుఁ బోయి చూడవలయు నని గుఱ్ఱమును బరు వెత్తించెను. వారును నూతనపురుషుఁ డెవఁడో గుఱ్ఱమెక్కి తమపయికి వచ్చుచున్నాఁ డని పరువిడ మొదలిడిరి. వారినిఁ గలసికొనవలయునని గుఱ్ఱమును ద్విగుణీకృతవేగముతో నడి పించెను. ఇదిగో పట్టుకొనెదను. ఇంక రెండడుగులలో దొర కెదరు. అనుకొనుచుఁ బదియేను యోజనములదూర మరిగెను. అంతలో నాకిన్నరమిథున మొకకొండశిఖరముపై నెక్కెను.

రాజు తనదృష్టిని మరలించి తనగుఱ్ఱమును దానును మిగుల నలసినట్లు గ్రహించి తనలోఁదాను ‹‹ ఎందుల కీనిరర్థక ప్రయాసము ? వారిని బట్టుకొంటినేని గలిగినలాభ మేమి ? పట్టుకొనకున్నఁ గలిగెడునష్ట మేమి ? ఇట్టిప్రయోజనముమా లినపనులోఁ బ్రాదల యెందులకు? మూర్ఖుఁడ నగుటినే. చిన్న పిల్లవాఁడనా ? కాల మెంతవ్యర్థపుచ్చితిని. రాజధర్మము నెఱ వేర్చినట్టా ? మిత్రకార్యము సాధించినట్టా ? వచ్చునపు డాదా రినిగూడఁ జూచుకొనలేదె. సువర్ణపురమునకుఁ ద్రోవ చెప్పు వా రెవరు ? జనసంచారశూన్యమగుమహారణ్య మిది. ఎంత తెలివితక్కువపని చేసితిని. '' అని విచారించి భూగోళవిషయ ము చెప్పునపుడు ‹‹ సువర్ణపురము ఉత్తరదిక్కున నుండుపట్టి

ణములకు హద్దనియు దానితర్వాత నిర్జనారణ్య మఱియు నది దాఁటినచో, కైలాస మనియు వినియున్నాను. ఆనిర్జనారణ్యము దాఁటి వచ్చితిని. ఇది కైలాసము గావలయును. ఇఁక నిక్కడనుండి తిన్నగా దక్షిణమునకుఁ బోయినచో సువర్ణపురమునకుఁ బోఁగలను. ఆత్మకృతాపరాధమునకు ఫలమనుభవించి తీఱవలెను." అని యనుకొని గుఱ్ఱమును మరలించెను. అంత నాకసమువంకఁ జూచెను. రెండుజాములకాల మయినది. గుఱ్ఱము అలసిపోయినది. కొంచెము గడ్డిమేఁపి నీరుపెట్టి యలయిక దీర్చి నేనును కొంచెముదకము త్రావి యొక చెట్టుక్రిందఁ గొంచెముసేపు విశ్రమించెద నని నీరున్నప్రదేశమునకై వెదకుచుండెను. కొన్నిజాడలనుబట్టి యాప్రాంతమున సరస్సుండునని యూహించి యాజాడలుగలదారినే పోయి యచ్ఛోదమను మహాసరస్సును గాంచెను. ఆసరస్సును జూచినంతమాత్రముననే శ్రమమంతయుఁ బోవ మిగుల సంతసము గలిగి యిట్లనుకొనెను. "కిన్నరమిథునమును వెంటాడుట నిరర్థకవ్యాపారమనుకొంటిని గాని దానిమూలముననేగదా యిట్టిసరోవరమును జూడఁగంటిని. ఇంతకంటె జన్మమునకుఁ గావలసిన దేమున్నది? నేత్రములు ధన్యము లయ్యె. కావుననే యీశ్వరుఁడు కైలాసనివాసి యయ్యెనుగాఁబోలు" అనుకొని దక్షిణతీరమునఁ దనగుఱ్ఱమును డిగి గుఱ్ఱమునకుఁ గళ్ళెముఁ బల్లమును తీసి వైచెను. గుఱ్ఱము నేలపయిఁ బొర్లి లేచి కొంచెముగడ్డి మేసి

సరస్సులోనికి దిగి నీరు ద్రాగి నిలిచియుండ దానిని రాజకు మారుఁ డాకచెట్టునకుఁ గట్టి కత్తితోఁ గోసిన లేఁతగడ్డి దాని ముందటఁ బడవేసి తానును నీటిలో దిగి కాళ్ళుఁ జేతులును గడుగుకొని కొంచెము నీరుద్రావి పైకివచ్చి కొన్నితామరాకు లు రాతిపలకమీఁదఁ బఱచి తలకుఁజుట్టిన యుత్తరీయము క్రిందనుంచి కూర్చుండెను.

కొంచెముసేపు విశ్రమించినతర్వాత ఇంద్రాయుధము చెవులు నిక్కఁబెట్టి యుత్తరముఖముగా నిలఁబడి యేదియో వినుచున్నట్టు గనఁబడినది. ఏమి యని రాజకుమారుఁ డను కొనునంతలో వీణాతంత్రీఝంకారముతోఁ గలసి శ్రావ్యము గానున్న సంగీతధ్వని వినఁబడెను. "ఏమి! మనుష్యసంచార ము లేనియీప్రదేశమున సంగీతమునకు సంభవ మెట్లు" అని మనమునఁ దలఁచి సంగీతము వినుపించినదిక్కునకుఁ జెవియొగ్గెను. సంగీతము పాడుచున్నప్రదేశ మక్కడకు సమీపముగానే యుం డుటచే సంగీతము స్వరవిశేషసహితముగా స్పష్టముగా నాత నికి వినఁబడెను. సంగీతశ్రవణమందలియాసక్తికంటె ఇట్టినిర్జన ప్రదేశమున నెవరు సంగీతమును పాడుచున్నారో? వారిచట నేల యుండిరో తెలిసికొనవలయు ననుకుతూహల మధిక మ య్యె. అంత నతఁడు గుఱ్ఱమెక్కి, గానమందలియాసక్తిచేఁ దనకంటె ముందు మందమందలుగా నాదిక్కునకుఁ బోవుహరి ణములనుబట్టి మార్గము తెలిసికొని కొంతదూర మరుగ నచట

శివునిసిద్ధాయతన మొకటి గనఁబడెను. ఆశివాలయమునకుఁ బోయి యీశ్వరలింగమును జూచెను. ఆలింగము నెవరో మందాకినీపుండరీకములతోఁ బూజించిరి. ఆలింగమునకు నాల్గు ముఖము లున్నవి. దక్షిణముఖమువయిపున దేవాభిముఖముగాఁ గూర్చుండి వీణ చేతఁ బూని శివునిగుఱించి పాటపాడుచున్నయొకకన్యక నాతఁడు చూచెను.

అతఁడు గుఱ్ఱముదిగి దానిని జెట్టుగొమ్మకుఁ గట్టిపెట్టి శివలింగసమీపమునకుఁ బోయి శివునకు సమస్కారము చేసి చెప్పవాల్పక యాకన్యకను జూచుచుండఁగ నతనికి మనమున నిట్లుతోఁచెను. "జనులకు చెప్పను నను కొననివృత్తాంతము లెన్నియో సంభవించుచుండునుగదా.

నేను వేటకొఱకు వనమునకు వచ్చితిని. అచటఁ గిన్నరమిథునము గనఁబడ నిరర్థకముగా వారిని వెంటాడించి వచ్చితి, దానిమూలమున దివ్యప్రదేశము వీక్షించితిని. నీటికై వెదకుచుండ సరోవరము గనఁబడెను. ఆతీరమున విశ్రమింప నమానుషగానము వినఁబడినది. దానినిబట్టి రాఁగా నీదివ్యకన్యక దర్శనము లభించెను. ఈమె దివ్యకన్యకయనుటలో సందేహము లేదు. మనుష్యులలో నిట్టిరూపరేఖావిలాసాదులు సంభవించుట యెట్లు ? నన్నుఁ జూడఁగానే యుంత్థాన మొందనిచో, కైలాసపర్వతశిఖర మెక్కి కనఁబడకుండఁగ నెటులనో యెడల, ఆకాశమార్గమున నెగిరిపోని పక్షమున "నీ వెవరు ? నీ

పేరేమి ? నీవిట్టియౌవనారంభదశలో తపస్సు సేయ నేల ? అని యామెనే యడిగెదను. ”

అని యనుకొనుచు నాస్ఫటికమండపమున నొకస్తంభమునొద్దఁ గూర్చుండి యామె సంగీతము చాలించునయమును దాఁక నిరీక్షించుచుండెను. అంత నామె గానము కట్టిపెట్టి లేచి శివునికి నమస్కారము చేయుచుఁ బ్రదక్షిణము సేసి తెల్లనిచల్లనిచూపులతోఁ జంద్రాపీడునిఁ జూచి పలుకరించెను. “ అతిథికి స్వాగతమా ? మహానుభావా ! మీరీప్రదేశమున కేల వచ్చితిరి. లెండు. అతిథిసత్కారము గొనరండు. ” అన వాతఁడు దివ్యకన్యక పలుకరించుటయే మహాప్రసాద మని యెంచి లేచి యామెకు నమస్కరించి “అమ్మా! మీసెలవు ” అని వెళ్లుచున్నయామెవెంట శిష్యునివలె భక్తితో వెళ్ళుచు మనస్సులో “ అమ్మయ్యా ! నన్నుఁ జూచి యీమె యంతర్ధానము గాలేదు. ఈమెవృత్తాంత మడిగితినేని చెప్పు ననునాశ కలదు. ” అని తలఁచుకొనుచు నూఱడుగులదూరమున నున్న గుహాముఖమున కామెతోఁ బోయెను. ఆగుహ మునులకుఁ గావలసినసర్వపదార్థములతోను నిండియుండెను ఒకమూల మణికమండులువు, ఒకతట్టున యోగపట్టిక, యొకచోటఁ బాదరక్షలజోడు, యొకప్రక్కను నారచీరలు పఱచినపఱిక, వేఱొకస్థలమున, శంఖమయమగు భిక్షాకపాలము, ఒకచో విభూదిసొలకాయయు నుండె. అవి చూచుచు నతఁడు ద్వారమున

నొకశిలాతలము మీఁదఁ గూర్చుండెను.

ఆమె లోపలికిఁ బోయి వీణ నారచీరలపక్కకుఁ దల వైపున నుంచి యాకులదొప్పతో నుదకము పట్టుకొనివచ్చి యర్ఘ్యపాద్యములకై యీయవచ్చిన నతఁడు "చాలుఁ జాలును. అంతపరియాస మేల? భగవతి! నీదృష్టిప్రసారము చేతనే మిగుల సంతుష్టుఁడ నయితిని. అంతియత్యాదర మక్కఱలేదు. కూర్చుండుము. అనియు నామెనిర్బంధమున నామెచేయు నతిథిసత్కారములను నమ్రతతో గ్రహించెను.

ఆమె యతిథిపూజ సేసినతర్వాత నాతనిసమీపమున నున్న రెండవశిలాతలమునఁ గూర్చుండి కొంచెముసే పూరకుండి యాతనివృత్తాంత మడుగ నతఁడు దిగ్విజయయాత్ర మొదలుకొని తనవృత్తాంతము దెలిపెను. అంత నామె లేచి భిక్షాకపాలము చేతఁ బట్టుకొని వృక్షమూలములకుఁ బోయి నిలఁబడ నామెభిక్షాకపాలమున ఫలములు తమంతటఁదామే పడినవి. ఆఫలములు దెచ్చి యామె చంద్రాపీడునకు భుజింపుమని యిచ్చెను.

చంద్రాపీడుఁ డాశ్చర్యము నొంది, తపస్వులకసాధ్యము లేదుగదా. ఇంతకంటె నాశ్చర్య మేమియున్నది. చేతనాశూన్యము లగువృక్షములుఁగూడ భిక్ష కోరినపుడు ఫలములిచ్చుచున్నవి. ఇట్టిచిత్ర మెక్కడను జూడలేదు. అని యనుకొనుచు లేచి తనగుఱ్ఱమును సమీపమునఁ గట్టి స్నానాదిక్రియలు

తెచ్చికొని యామె పెట్టినఫలములు భుజించి లేచి, యామె ఫలాహారము గైకొనునంతదాఁక కొంచెముదూరముగ నుండి, తర్వాత నామె కూర్చుండినశిలాతలమునకు దగ్గఱగాఁ గూర్చుండి కొంచెమునే పూరకుండి వినయముతో "భగవతి! నీ వనుగ్రహముచూపుటచేఁ గొంచెము చనవు గలిగి యొకప్రశ్న మడుగఁ గుతూహలపడుచున్నాను. ఇట్లువేడుకపడుట మా మనుష్యజాతికి సహజము. నీకు శ్రమగానుండనియెడల నన్ను గ్రహింపుము. నీవు జన్మించినకుల మేది. గంధర్వాప్సరసలలో నేకులము? ఇట్టివయసున వ్రతాచరణ మేల? నీవయస్సెక్కడ? ఈతప స్సెక్కడ? నీరూప మెక్కడ? ఈవ్రత మెక్కడ? సర్వ సౌఖ్యములును వీడి యీనిర్జనారణ్యమునఁ దప స్సొదులకుఁ జేయుచున్నావు? ఏమి నీశరీర మింతతెల్లగా నున్నది?" అని చంద్రాపీడుఁ డడుగ నామె క్షణమాత్ర మేదియో ధ్యానించి ఉస్సు రని నిట్టూర్పులు నిగుడించి కన్నీరు వెల్లువలై పాఱ నేడ్వఁ జొచ్చెను.

అట్లు రోదనముచేయు నామెను జూచి చంద్రాపీడుఁడు "ఆహా ఏమి ఇట్టియాకృతినిగూడ దుఃఖములు వశపఱచుకొన్నవే ఎట్టివారికిని శరీరధర్మము లగు సుఖదుఃఖాదిద్వంద్వములు తప్పవుగదా. ఈమె కింతకన్నీరు వచ్చుటచేతఁ గూడ నీమె చరిత్రము దెలిసికొనఁ గుతూహలము హెచ్చుచున్నది. ఇట్టివారు సామాన్యకారణమున నింతదుఃఖ మొందరు. ఏదేని

పెద్దకారణ మొందును. సామాన్యపుఁబిడుగు పడినచో భూమి వడఁకునా? ఆమె కట్టికుఃఖమును జ్ఞప్తికిఁ దెచ్చి అపరాధి నైతినని యనుకొని లేచి యప్పట నున్నకాలువనుండి దోసిలి తో నీళ్లు దెచ్చి యామెకిచ్చి కన్నులు కడుగుకొను మని నిర్బంధపెట్టెను.

ఆమె యాతనినిర్బంధముచేత నానీటితోఁ గన్నులు కడుగుకొని నారచీరకొంగుతో మొగము తుడుచుకొని వేఁడి నిట్టూర్పులు విడిచి మెల్లగాఁ జంద్రాపీడునితో నిట్లనెను. "రాజకుమారా! దురదృష్టవంతురాలను. దయాశూన్యురా లను. పాపిని. నావృత్తాంత మేల? జన్మము మొదలుకొనియు రోఁత గలిగించువృత్తాంతము. అది నీవు విన నేల? నీ కంత గా వినవలయు నని యున్నచోఁ జెప్పెదను వినుము.

౪

దేవలోకమున నప్సరసలు గలరని విని యే యుందువు. వారివి. పదునాలుగు కులములు. దక్షునికుమారికలలో ముని యనునదియు నరిష్ట యనునదియు నిద్దఱును గంధర్వశ్రేష్ఠుల నిద్దఱఁ బెండ్లాడిరి. అవి రెండుకులములు. మిగిలినవిపండ్రెండు కులములు. వానిలో బ్రహ్మయొక్క మనస్సువలన నొకటి. వేదముల వలన నొకటి చంద్రికిరణములవలన నొకటియు గల్గినవి. ఇట్లే మిగిలినవానికిని జన్మమూలములు భిన్నభిన్నములుగా నున్నవి.

మునియను నామెకును బదునార్గురు పుత్రులు. వారిలోఁ బదునాఱవవాఁడు కనిష్ఠుఁ డయ్యు గుణజ్యేష్ఠుఁడు. చిత్రరథుఁడను పేరఁ బ్రసిద్ధుఁడు. పరాక్రమమున ముల్లోకములయందుఁ బ్రఖ్యాతి వడసి యింద్రునిచే మిత్రుఁ డనిపించుకొని గంధర్వాధిపత్యమును బాల్యముననే సంపాదించెను. ఇక్కడకు దగ్గఱనే భరతవర్షమున కుత్తరముగాఁ గింపురుషవర్షము కలదు. అందు హేమకూటపర్వత మతనినివాసము. అతఁడే యీయుపవనమును నిర్మించెను. కావుననే దీనికిఁ జైత్రరథ మనిపేరు వచ్చినది. ఈయచ్ఛోదమనుసరస్సు నతఁడు త్రవ్వించినదే. ఈశివాయతన మాతఁడు కట్టించినదే.

అరిష్టకు నార్గురుకొడుకులు. వారిలోఁ బెద్దవాఁడు హంసుఁడను వాఁడు. అతనిని రెండవగంధర్వకులమునకుఁ బ్రభువుగాఁ జిత్రరథుఁడే యేర్పఱచి పట్టముగట్టెను. అతఁడును హేమకూటముననే నివసించుచుండును.

చంద్రకిరణములవలనఁ బుట్టినకులమున గౌరియను నాఁ లావణ్యవతి జన్మించెను. ఆమెను గంధర్వకులపతియగు హంసుఁడు వివాహము చేసికొనెను. ఆదంపతులు పార్వతీపరమేశ్వరులవలెను లక్ష్మీనారాయణులవలెను నుండిరి. ఆమహానుభావులగర్భము చెఱుప నిట్టివికృతరూపముతోఁ బహుదుఃఖపాత్రురాలనగు నేను పుట్టితిని.

మాతండ్రికి సంతానము లేనివాఁడగుటచేత, నేను పుట్టిన

పుడు కుమారుఁడు గలిగినపుడు చేయఁదగినయుత్సవముకంటె నధికోత్సవము చేసెను. పదియవనాఁడు కులాచారప్రకారము నారూపానురూపముగా మహాశ్వేత యను సార్థకనామము పెట్టెను. నాజనకులును బరివారమును గంధర్వులు నందఱు నాతో గారాబముగా నన్నుఁ బెంచిరి. బాల్య మతిక్రమించి యౌవనము వచ్చినది. ఒకవసంతకాలమున మాతల్లితోఁ గలసి యీయచ్ఛోదసరమున స్నానము చేయవచ్చితిని. సఖీజనముతోఁ గలసి యచ్చటివిశేషములు చూచుచు నటునిటుఁ దిరుగుచుండ నొకదివ్యకుసుమసుగంధ మొకవైపుననుండి వచ్చినది. ఇంతపరిమళ మెచ్చటనుండి వచ్చెనో యని యాలోచించుచుఁ గన్నులుమూసికొని యాసుగంధానంద మొకక్షణ మనుభవించి అది యేమో తెలిసికొనుటకా సుగంధమువచ్చినవైపునకుఁ బోయితిని. దేహకాంతితో వన మంతయుఁ గనకమయమును గావించుచున్నొకతాపసయువకుఁడు స్నానార్థము వచ్చుచుండెను. తుల్యములగు రూపయౌవనములు గలమునికుమారుఁ డొకఁడు దేవతార్చనకై పుష్పములు గోయుచు నాతనివెంట వచ్చుచుండెను. ముందువచ్చుతాపసయువకుఁడు కర్ణాలంకారముగా ధరించిన పారిజాతపుష్పమంజరి చూచితిని. ఆపరిమళము దానిదే కాని యితరము గాదని నిశ్చయించి యాతపసుముఁదతని రూపాతిశయము చూచి, చద్రికలహారము దీసి సమునేను విరపదార్థములసారము దానితోఁ గలిపి యాతనిని బ్రహ్మ

స్పృశించియుండు నని బ్రహ్మకౌశల్యమునకు మెచ్చుకొనుచు, ఆనందపరవశురాల నయి క్షణమాత్ర మేమియు దెలియకుండ నుండి తర్వాత "ఏమిది! ఎంతకూడనిపని. కులకన్యకల కిది యుచితము గాదుకదా" యని మనమును మరలింప యత్నించియు మరలింపనేరక పరవశ నయి వెఱ్ఱిదానివలె నాతనిని జూచుచుంటిని.

యోగ్యమా అయోగ్యమా లభ్యమా అలభ్యమా యని యాలోచింపకయే హృదయ మనురాగము నొందెను. ఆమహాతపశ్శాలి యెక్కడ! నే నెక్కడ! వానియందు ననురాగమయుక్తము అని యెఱిఁగియుండియు మనస్సును బట్టఁజాల నయితిని. ఈతఁడు నావికారములు చూచి కోపించి శపించినను శపించువచ్చును. ఈస్థలము విడిచిపోవుటయే యుక్తమని యోచించి వెడలిపోవఁ దలఁచి అంతలో ఋషిజాతి సమస్తజనవందనీయముగదా నమస్కరించిపోవుద మని యాతనికి నమస్కారము గావించితిని.

నేను నమస్కరింపఁగానే అనురాగమహిమమో, మధుమాసమహాత్మ్యమో, యౌవనప్రభావమో, నా దౌర్భాగ్యదశయో, ఇంతకు నన్ను కావలసినవిధి యునదో ఏకారణ మయిన నేమి? దీపముదగ్గఱకుఁ జేర్చ మఱొకదీప మంటుకొన్నట్లు నావికార మాతనికిగూడ నంటుకొనెను. ఆతనివికారము జూచి నావికారము ద్విగుణమో త్రిగుణమో యయ్యెఁ మఱి

కొంతసేపటికిఁ గొంచెముదగ్గఱకుఁ బోయి నే నాతనిసహచరునిఁ బలుకరించి "యీతఁ డేతపోధనునికుమారుఁడు? ఈతనిచెవిలో నున్నకుసుమమంజరి యేచెట్టుది? దీనిసౌరభ మసాధారణము." అని యడుగ నాతఁడు చిఱునవ్వునవ్వి "బాలా! అట్లడుగుటవలన నీకుఁ బ్రయోజన మేమి? అయినను వేడుకపడుచున్నావు గానఁ జెప్పెద వినుము.

"శ్వేతకేతు వనుమహాముని కలఁడు. ఆతఁడు మహాసౌందర్యశాలి. ఆతఁ డొకనాఁడు దేవతార్చనకై తామరపువ్వులు కోయఁ దలఁచి గంగానదికి వచ్చెను. ఆశ్వేతకేతువును పుండరీకనివాసిని యగులక్ష్మి చూచి యట్టిసుందరాకారునివలన సంతతి వడసిన నెంతబాగుగా నుండునో కదా యని యనుకొనెను. ఆమెసంకల్పవిశేషము సిద్ధించి యొకకుమారుఁడు గలిగెను. ఆమె యాకుమారుని శ్వేతకేతువున కిచ్చెను. ఆబాలుఁడు పుండరీకమున సంభవించెను గానఁ బుండరీకుఁ డనినామకరణము చేసి శ్వేతకేతువు సకలవిద్యలయందును బరిపూర్ణుని గావించెను. ఆతఁడే యీతఁడు.

ఈతఁడు బ్రహ్మచర్యవ్రత మాచరించుచున్నవాఁడు. ఈపుష్పమంజరి పారిజాతపుష్పమంజరి. బ్రహ్మచర్యవ్రతమునకు విరుద్ధముగా నీపుష్పమంజరి యీతఁడు ధరించుటకుఁ గారణము వినుము. నేఁడు చతుర్దశి గాన నీశ్వరసేవ సేయువలయు నని యీతఁడును నేనును స్వర్గలోకమునుండి కైలాస

మునకు వచ్చుచుండఁగా నందనవనమందలివనదేవత యీతని
సౌందర్యము పొగడి "నీలోకోత్తరసౌందర్యమున కీపారిజాత
పుష్పమంజరి తగును. ఇది కర్ణభూషణముగా ధరింపుము. నీవం
టి త్రిలోకసుందరపురుషుఁడు ధరించుటచేఁ బారిజాతజన్మము
కూడ ధన్య మగును." అని యీపుష్పమంజరి యీయ
నీతఁడు ఆత్మస్తుతి వినఁబడుటచేఁ గొంచెము తలవంచుకొని
ఱెప్పలు క్రిందికి వాల్చి దీనిని నిరాకరించి పోవుచుండెను.
ఆవనదేవత దీనిని సార్థకము చేయుము. అని కోరుచు వెంటవ
చ్చుచుండుట నేను చూచి "మిత్రమా! తప్పేమున్నది?
పుచ్చుకొనుము. ఆమెకోరిక చెల్లింపుము." అని నిర్బంధప
ఱచితిని. నిషేధించుచున్నను అది కర్ణాభరణముగా ధరింపఁ
జేసితిని. అని యాతనిసహచరుఁడు చెప్పి యూరకుండఁగాఁ
దపోధనయువకుఁడు కొంచెము మందహాసముచేసి "బాలికా
మణీ! ని వెందుల కింతశ్రమపడి ప్రశ్న చేసితివి. నీకు దీనిపరి
మళము నచ్చినచోఁ బుచ్చుకొనుము ఇచ్చెదను. అని చెప్పి
దగ్గఱఁగా వచ్చి స్వయముగా నాపుష్పమంజరి తనచేతితో
దీసి నా చెవి నలంకరింపఁ జేసెను. నాకపోలతలస్పర్శసుఖమునఁ
జంచలాంగుళి యగునాతనికరతలమునుండి యక్షమాల జాఱి
పడిపోయెను. అది యాతఁడెఱుఁగనే యెఱుఁగఁడు. ఆయక్ష
మాల నేలమీఁదఁ బడకుండఁగానే నేను పట్టుకొని నామె
డతో సవిలాసముగా వైచికొంటిని. అతనిభుజలతతో నాకం

తము గౌఁగిలించెనంతయానంద మొందితిని.

ఇట్లు జరుగునంతలో ఛత్రగ్రాహిణి వచ్చి "రాజకుమారీ! దేవి స్నానము చేయుట కైనది. మనము ఇంటికిఁ బోవువేళ యైనది. నీవుగూడ స్నానము చేయుము." అని చెప్పఁగా మనస్సులో నిష్టము లేకున్నను బలవంతముగాఁ బోవ యత్నించి కొన్నియడుగులు నడువ నాదృష్టి యాతనిముఖమునుండి మరలదాయెను. బలాత్కారముగా దృష్టినిగూడ మరలించుకొని స్నానముసేయఁ బోవుచుంటిని. నేను బోవుచుండఁగా నాసుందరాకారుఁ మిత్రుఁడు మునికుమారునిచాపల్యము గ్రహించి కోపము చూపుచు "మిత్రా! పుండరీక! ఇది నీకుఁ దగునా? ఈమార్గము క్షుద్రజనక్షుణ్ణము. ధైర్యధనులుగదా సాధుజనులు. అజ్ఞానివలె ఆత్మను నిరోధింపలేక హీనమార్గమునఁ బ్రవర్తించుచున్నావు. నీవిద్య, నీతెలివి, నీధైర్యము, నీబ్రహ్మచర్యము, నీగురూపదేశములు, నీవైరాగ్యము, నీవేదాంతవిచారణము ఇవన్నియు నేఁగంగలోఁ గలిపితివి. ఎంత ప్రమాదము. చేతినుండి జాఱిపడిపోయినయక్షమాలగూడ నెఱుఁగవే. చైతన్యముగూడ నంతరించినదా."

అని యదలింప నాతఁడు లజ్జపడి "మిత్రమా! కపింజల! అన్యథా భావింపకుము. ఈకన్యక యక్షమాల తీసినతప్పు సహింపను. చూడు" అని లేనికోపము తెచ్చిపెట్టుకొని ప్రయత్నముతో కనుబొమలుముడివైచి పెదవులాడించుచు "ఓసి!

చపలురాలా! అక్షమాల యీయకుండఁగ నిక్కడనుండి యడు గైనఁ గదపఁగూడదు." అని పలికెను. నేనది గ్రహించి నా మెడలో నున్న నాయేకావళి తీసి "ఇదిగో అక్షమాల తీసికొ నుమని నాదృష్టి యాతనిముఖముననే నిలిపి చూచుచునతని చే తిలో నుంచితిని. అతఁడు శూన్యహృదయుఁ డయి నేనిచ్చిన దేదో తెలియఁగనే యెఱుఁగఁడు. నాకు స్వేదోదకముతో నే స్నానము మైపోయినది. అయినను సరోవరమున స్నానము సేయ తలఁచితిని.

ఎట్లో స్నానముచేసి మాతల్లితోఁ గలిసి పురమునకుఁ బోవుచుంటిని గాని నాహృదయ మంతయు నాతనిపై నుండెను. ఆతనిరూపరేఖావిలాసములు తలపోయుచు నెట్లో యింటికిఁ బోయి కన్యాంతఃపురమున విరహబాధ నొందుచు ఏమి చేయుచుంటినో ఏమి యనుచుంటినో ఏమియు నెఱుఁగను. ప్రాసాదముపై నెక్కి యెవ్వరిని రానీయవలదని ద్వారమునఁ గావలి పెట్టి గవాక్షములోనుండి యాతఁ డుండుదిక్కునకుఁ జూపు ప్రసరింపఁ జేయుచు ఆవైపునుండి వచ్చుగాలినిగూడ నతనివృత్తాంత మడుగఁబోవుచు నంతలో నిది యేమి? యని యాఁగుచు మెడలోనున్న యక్షమాలను, కర్ణమునను న్న పారిజాతమంజరిని స్పృశించి యాతనిని స్పృశించినట్లే సుఖించుచుఁ గాలము గడపుచుంటిని. అంతలోఁ దరళికయనునది, నాఁడు నాతో స్నానమునకువచ్చినయడపకత్తె నాదగ్గఱకు వచ్చి మెల్లగా ని

స్లనియెను. భర్తృదారికా! నాఁ డక్కడఁ గనఁబడిన ఋషికుమారులలో నీకుఁ బుష్పమంజరి యిచ్చిన యాతఁడు, రెండవవానికిఁ గనఁబడకుండఁగా నాయొద్దకు వచ్చి నిన్నుఁ గుఱించి యీ కన్యక యెవరు? ఆమె పే రేమి? ఎక్కడకుఁ బోవుచున్నది? అని యడుగ " చంద్రాంశమునఁ బుట్టిన గౌరియను నప్సరసయందు గంధర్వరాజగు హంసునివలన జన్మించిన కన్యక. మహాశ్వేత యని పేరు. ఆమె హేమకూటమునకుఁ బోవుచున్నది. " అని చెప్పితిని.

నామాటలు విని యాతఁడు ఏదియో యాలోచించుచు క్షణమాత్రము మాఱకుండి నన్ను బలిమాలుచున్నట్లు బాలికా! కల్యాణీ! నీవు నామెయు నొకరీతిగానే యుండదు. సఖులుగదా. నాదొక ప్రార్థన యున్నది. చెప్పెదవా? అని యడుగ నేను వినయముతో " మీ రంతఁగాఁ జెప్పవలయునా? తమసెలవుప్రకారము చేసెదను. " అని చెప్పఁగా నాతఁ డొక పత్రిక యిచ్చి యిది యాకన్యక యొంటరిగానున్నపుడే యీ యవలయును అని దానిని నే నంగీకరించి తెచ్చితిని. అని తాంబూలకరండములోనుండి తీసి యొక వల్కలపట్టిక యిచ్చెను. అది చేతఁ బుచ్చుకొని యందు వ్రాసియున్న పద్యము చదివితిని. అది యెట్లంటే-

" లలితబిసనసితహా క్తికలతను జూచి
లోభపెట్టుచు నాళము లోనుచేసి

మానసోద్భవ మీవతిమాత్రిదూర
మంచఁబోలెను గొనిపోయి తెంచదాన. "

అది మరలమరలఁ జదివితివి. రెండవమహా శ్వేతమహానుభావురా దర్శనము చేసినతరలికజన్మము ధన్య మని మెచ్చితివి. తరలికా! చెప్పుచెప్పు. ఆతఁడు దర్శనము చేసితివి. ఏమని యడిగెను? ఎంతసేపు కలసిమాటలాడితివి. అని మరలమరల నడుగుచు నాకు చెప్పినదే మరలఁ జెప్పుచుండ నాదరముతో వినుచు నుంటిని.

అంతలో ఛత్రగ్రాహిణి వచ్చి "భర్తృదారికా! ఆ ఋషికుమారులలో నొకఁడు వచ్చి ద్వారమున నుండి అక్షమాల నడుగుటకై వచ్చినా నని చెప్పుచున్నాఁ" డన నేను మునికుమారుఁ డన్నమాట వినునప్పుడే ఆతఁడే వచ్చినాఁ డని యనుకొని కంచుకిని వెంటనే తీసికొనిరమ్మని పంప నా తఁడు లోనికిఁ దీసికొనిరాఁగా, కపింజలుఁడను నాతనిమిత్రుఁడు వచ్చుచుండెను. ఆతనిముఖము చూచి ఏదో విచారమునొందుచున్నట్లు గ్రహించితిని. లేచి నమస్కరించి స్వయముగా పీఠము వైచి యాతఁడు వల దన్నను నిర్బంధపెట్టి యాతనిపాదములు గడిగి నాచీరకొంగుతోఁ దుడిచి యాతనిదగ్గఱఁగాఁ గూర్చుంటిని. అతఁ డేదో చెప్పఁదలఁచి యుండి మాసమీపమునఁ గూర్చుండినతరలికవైపు చూచెను. నే నాతని భావము గ్రహించి "అయ్యా! మీరు చెప్పవచ్చును. సందేహింప నక్కఱలేదు.

నాకును తరలికకును భేదము లేదు. నాద్వితీయప్రాణమే ''
అని చెప్ప నాతఁ డిట్లనియెను.

''రాజపుత్రీ! ఏమి చెప్పుదును. సిగ్గుచే నోట మాటే రాకున్నది. కందమూలఫలాహారులగుమునిజను లెక్కడ? రాజకుటుంబోచిత మగుభోగాభిలాష మెక్కడ? అంతయు నసంబద్ధముగా నున్నది. ఇతరోపాయము కనఁబడలేదు. మఱొక ప్రతిక్రియ యేదియు లేదు. చెప్పకుంటినేని మహానర్థము సంభవించును. ప్రాణత్యాగము చేసియైనను మిత్రునిప్రాణములు రక్షించుట విధిగదా. తప్పక చెప్పుచున్నాను. నా మిత్రుఁడు నీయెడలనే నామీఁద కోపము వచ్చి నిష్ఠురముగా మాట లాడినాఁడుగదా. నే నతనిని విడిచి పుష్పములు కోయుట మాని వేఱొకప్రదేశమునకుఁ బోయితిని నీవు వెడలి పోయినతర్వాత నొంటరిగా నేమి చేయుచున్నాఁడో చూచెద నని యాప్రదేశమునకుఁ బోవ నతఁ డక్కడఁ గనఁబడఁ డయ్యె అంత నేమియుఁ దోఁచినది కాదు. మైత్రిచేత నొకక్షణమైన నెన్నఁడు నతనిని విడిచి యుండలేను. ''మోహావశుఁ డయి యాకన్యకవెంబడి పోయియుండునా? ఆమె వెడలిపోయిన తర్వాత నా మొగము చూడ సిగ్గుపడి యెక్కడికైనఁ బోయి యుండునా? లేదా నన్నే వెదకుచు నేమూలకో వెళ్లెనా'' యని యూహాపోహలు సేయుచుఁ గొంతసేపు నిలఁబడి ''సిగ్గునకే యొక్కవేళ అనిష్టముగూడఁ జేయవచ్చును. అతని నొంటరి

గాఁ దుండనీయరాదు." అని అతనికై వెదకి వెదకి కనఁబడకపో వుటచే నశుభ మాశంకించుచు నాతురతతో నలువైపుల వెదకి నొకలతామండపమున దయ్యము సోఁకినవానివిధమున, నిష్ప్రవృత్తి నశాసరీరుని, జన్మాంతరము నొందినవానిసరణి రూపు మాసిపోయి నీముక్తావళి యురమునఁ దాల్చి తెప్పపాటు లేక యేదో యాలోచించుచున్నవానియవస్థ చూచి యేమిది యని భయపడి దగ్గఱకుఁ బోయి యాశిలాతలమున నొకమూలఁ గూర్చుండి వానిభుజశిరస్సులపయిఁ జేయి వయిచి "అంత జ్ఞానవంతుఁడు, అంతతపఃశాలి అంతవ్రతదీక్షాదీక్షితుఁడు తుద కిట్లయ్యెనే యని యనుకొని యాశ్చర్యపడుచు మిత్రమా! ఏమిది యని యడుగ నాతఁడు గంటఁగాలువలుగా వచ్చుకన్నీరు తుడిచికొని బలవంతముగాఁ గన్ను తెఱచి నన్నుఁ జూచి సిగ్గుచేత నస్పష్టాక్షరముగా "మిత్రా! ఎఱిఁగి యుండియు నన్నడిగెద వేల." అనెను.

మిత్రుఁడు సన్మార్గము దాఁటి ప్రవర్తించినపుడు మరల త్రిప్పఁ బ్రయత్నించుట న్యాయ్యముగాన నేననేకవిధములఁ దపశ్శాలి కిది తగునా యని నిదర్శనములతో, నీతులతో, శాస్త్రోదాహరణములతో నంతో బోధించితిని. అది విని చేయవద్యు. వయిపిచ్చు నాచేయి పట్టుకొని మిత్రమా! యిట్టిమాటల కేమి? నేను బ్రతికెడుసాధనము చూడుము. ఒడలంతయు మంటలు. గుండెలు లాగివోవుచున్నవి. నో రెండిపోవుచున్నది.

దీనికిఁ బ్రతిక్రియ చూడుము.” అని యాతఁడు పలుక “ఇప్పుడిం కిది యుపదేశకాలము గాదు. ఆస్థితి దాఁటిపోయినది. ఇతని ప్రాణములు గాపాడుకొనినఁ జాలును. దానికై యత్నించెద” నని సరస్సునకుఁ బోయి తామరపూవులును, తూండ్లును, చల్లనినీరును దీసికొనివచ్చి శైత్యోపచారములు చేయుచు ఆరణ్యకుల మగుమన మెక్కడ? గంధర్వరాజపుత్రిక యగు మహాశ్వేత యెక్కడ? ఎట్లు సంఘటించును. ఈతని యవస్థ ప్రతీకార్యశూన్యముగాఁ గనఁబడుచున్నది. ఏమి చేయుదు నని యాలోచించి నీసహవాసముతప్ప వేఱొకసాధనమున నాతని ప్రాణములు రక్షింప శక్యముగా దని నిర్ణయించుకొని నే నిందకృత్యములు చేసితినైనను మిత్రునిప్రాణములు రక్షించుట ముఖ్య మనియెంచి కాలక్షేపము చేయరా దని యాతని యవస్థ నీతోఁ జెప్ప వచ్చితిని. వచ్చునపు డాతనితోఁ జెప్పిన సిగ్గుచేత వల దని నివారించు ననియు, మానిన నేమియు లాభములే దనియుఁ, ప్రాణాంతము సంభవించిన సంభవింప వచ్చుననియుననుకొని చెప్పక యే వచ్చితిని. ఈస్థితిలో నాతని యనురాగమును,నారాకయు, సమయమును జూచి నీకు యుక్త మని తోఁచినట్లు చేయుము. అని పలికి నేనేమిసమాధానము చెప్పుదునో యని నాముఖమునే చూచుచుండెను. ఆమాటలు విని నాహృదయ మమృతతరంగముల నోలలాడి నట్లయి నది. ఆనందబాష్పము లవార్యముగా స్రవించుచుండెను. ఆ

తపోధనుఁడు చెప్పినది నిజమే యైనచో నింతకంటె నా కేమి కావలయును. ఈ కపినోట నసత్యము వచ్చునా యని యాలో చించుచుండఁ బ్రతిహారి తొందరగా వచ్చి రాజకుమారీ! నీకు శరీరమున నస్వస్థతగా నున్న దని పరిచారికలవలన విని మహా దేవి చూచుటకు వచ్చుచున్నది. అని చెప్పెను. కపింజలుఁ డది విని సమ్మర్దమునకు భయపడి త్వరగా లేచి "రాజపుత్రి! కాలాతిక్రమణ మైనది. మిత్రప్రాణరక్షణము చేయుము. ఇదిగో నీకు నమస్కారము" అని నావలనఁ బ్రతివచన మపేక్షింపకయే యెట్లో వచ్చుచున్న జనసమ్మర్దమున నవకాశము కల్పించుకొని ద్వారము దాఁటి వెడలిపోయెను.

అంతలో మాజనని వచ్చి నాతో నేమేమో చెప్పెను. ఆమె యేమి చెప్పినదో ఏమి చేసినదో నే నెఱుఁగ నేనెఱుఁగను. అంతలోఁ బొద్దు క్రుంకినది. అంధకార మంతటను వ్యాపించినది. నామనస్సు అంధకారబంధుర మైనది. నాకు ముందుత్రోవ కనఁబడ లేదు. తరలికతో "సఖీ! కపింజలుఁడు నీయెదుట నేగదా సమస్తమును జెప్పినాఁడు. చేయవలసిన దేమో చెప్పుము. సామాన్యకన్యకవలె సిగ్గు చెఱచి వినయము విడిచి కులాచారము మీఱి మాతాపితల వంచించి యాతనిఁ బాణిగ్రహణము చేసికొంటినా, ధర్మమార్గ ముల్లంఘించినదాన నగుదును. ఈధర్మ మాలోచించితి నేని కపింజలుని ప్రార్థనకు భంగము చేసినదాన నగుదును. అంతియే కాక యీ

తపోధనయువకునకు నావలన నాశాభంగము గలిగి ప్రాణహాని సంభవింపవచ్చును. అప్పుడు మునీశ్వరునిఁ జంపిన పాపము కట్టుకొనెదను. అని మూర్ఛపడితిని. నాకుఁ దరళిక శైత్యోపచారములు చేయుటచేతఁగాఁబోలు మరల స్మృతి వచ్చినది. కన్నులు తెఱచి నేను చూచునప్పటికి బాష్పధారలు విడుచుచు రోదనముచేయు తరళికను జూచితిని. నన్నుఁ జూచి యామెను ధైర్యము తెచ్చుకొని నాపాదములకు నమస్కరించి యిట్లనియె "రాజకుమారీ! ఇంక సిగ్గేల. జనకులయాజ్ఞ యేల. ఆతనిని తీసికొనివచ్చెదను. నన్నుఁ బంపుము. లేదా నీవే స్వయముగా నక్కడకుఁ బొమ్ము. లేకున్న నపాయము వాటిల్లును, అన నామె సఖీ! మరల బ్రతికి నీ కాయాసము గలిగించుచున్నాను. లెమ్ము. మనము పోవుదము. అని తరళికను బట్టుకొని బలవంతముగా లేచితిని. లేచునప్పటికి నాకుడికన్నదరినది. "ఇది యపశకునము. దైవ మేమి చేయదలఁచెనో" యని సందేహించియు ఎఱ్ఱనిమేలిముసుఁగు వైచికొని ఆత్మపరివారముగూడ గుఱుతుపట్టకుండఁ బ్రాసాదశిఖరమునుండి దిగితిని. తరళిక నావెంట వచ్చుచుండెను. "చెలీ! నావలెనే యాతఁడును బాధ నొందునా! మనకతఁ డెదురుగాఁ వచ్చునా" అని నేనడుగ ఆమె నవ్వి "ఓసి! వెఱ్ఱిదాన! అతఁడు నీవిషయమున నింతకంటె నెక్కుడు వికారచేష్టలు చేయుచుండును," అనెను. అట్టి కొన్నిమాటలు చెప్పుకొనుచు నాతఁ

డున్న ప్రదేశమునకు దగ్గఱఁగాఁ జేరి సరస్సులోఁ గాళ్ళుకడుగు
కొనుచుండ నాతఁ డుండు ప్రదేశమునుండి యేదో రోదనధ్వని
వినబడినది. అది పురుషునికంఠధ్వనివలె నుండెను. కొంచెము
దూరమగుటచే నంతస్పష్టముగా వినఁబడ లేదు. మొదటఁ గూడ
కన్నదురటచేతనే సందేహము కలిగినది. ఆధ్వని వినగానే గుం
డె బ్రద్దలయి యొడల నంతటను వడఁకు పుట్టె నేదియో యశు
భము రానున్న దని యెంచి తరళికా ఏమి ఇది అనుచు తొంద
రతొందరగా నాతఁ డున్న వైపునకు బరుగిడితిని. అర్ధరాత్రమ
గుటచేత నంతయు నిశ్శబ్దముగా నుండెను గాన కొంచెము
దూరముగా నుండగానే “హా! హా! హాతవిధీ! ఎంతపని
చేసితివి. ఎంతకష్టము వచ్చినది. ఓసి దురాత్మురాలా! మహా
శ్వేతా! నీ కితఁ డేమి యపకారము చేసినాడే? హా! మహా
నుభావా! శ్వేతకేతూ! పుత్త్రవత్సల! నీ కెంతమోసము జ
రిగినదో నీ వెఱుఁగవుగదా! మిత్రా! నన్ను విడిచిపోయెద
వా! నిన్ను విడిచి యొకక్షణమైన నుండఁజాల నని నీ వెఱుఁ
గవా? నన్నుఁ గూడ దీసికొనిపొమ్ము. ప్రతివచన మీయ
నొల్లవా? అని పలువిధముల విలపించు విలాపము చెవులఁ
బడినది. ఆకంఠధ్వని కపింజలునిదని గుర్తుపట్టితిని. అప్పుడే
నాప్రాణము లెగిరిపోయినవి. ఏమిది యని యేడ్చుచుఁ బోవ
చూచుకొనకయే యడ్డపడి యారోదనము వినఁబడినచోటికి
వెళ్ళిపడితిని.

అక్కడ నొకశిలాతలముపయిఁ బడిచినమృణాళశయ్యపైఁ బరుండి యప్పుడే ప్రాణములుగోలుపోయిన యామునికుమారుని నిర్భాగ్యురాలనగు నేను జూచి మూర్ఛనొందితిని. అపయి నేమియు నెఱుఁగను.

నాహృదయ మతికఠినముగావునను, ఈశరీర మనేకదుఃఖము లనుభవింపవలసి యుండుటచేతను, ఇఁకను అనేక పాపకర్మముల ఫల మనుభవింపవలసి యుండుటచేతను, కొంతసేపటికిఁ జైతన్యము వచ్చినది. కన్నుఁ దెఱచి యాతనిమృతకళేబరము చూచి హా! హా! ఎంతయవస్థ సంభవించినది. హా! నాథ! ప్రాణేశ్వరా! నిన్నే శరణమొందిననన్ను విడిచి కరుణాశూన్యుఁడ వయిపోయెదవా! నీకై నే నెంతయవస్థ ననుభవించితినో తెరలిక నడుగుము. భక్తవత్సలా! భక్తురాలను, అనురక్తురాలను, ఆర్తురాలను, అనాథను బాలను రక్షింపవా? నీవు మృతినొందినను నేను బ్రతికియుంటిని. ఎందుల కీబ్రదుకు?" అని పలువిధముల విలపించి యాతనివక్షస్థలము చేతితో స్పృశించి "పుండరీకహృదయమా! ఎంతకఠిన మయినదాన వయితివి. ఆర్తురాలను నన్ను విడిచిపోయితివా?" అని యచట నున్నముక్తాహారము చూచి "ఓసి పాపాత్మురాలా! నేను వచ్చునంతదాఁక నయినను పుండరీకుని ప్రాణముల నాఁపఁజాలవైతివి" అనినిందించి కపింజలునివంకఁ జూచి "మహానుభావా! నీతప స్సేటయి ధారపోసితివా నీమిత్రుని బ్రతి

ంకిపు" మని యాంతని పాదములపయిఁ బడి లేచి తరలికను కౌఁగిలించుకొని తరలికా! ఏమిది! అయ్యో! అయ్యో! అని పెద్దయేడ్పేడ్చి "హా! నాథా! నాథా! ప్రాణేశ్వరా! అని మూర్ఛాపరవశ నయితిని." అని మహాశ్వేత చెప్పుచు గతవృత్తాంతస్మరణమున అసుఖ మప్పు డనుభవించుచున్నట్లు మనమునకుఁ దోఁచి మూర్ఛపడిపోయెను.

చంద్రాపీడుఁ డామెయవస్థ చూచి జాలి నొంది యామెను బట్టుకొని యామెకన్నీటితోఁ దడిసినచీరకొంగుతోనే కొంచెముసేపు విసరఁగా నామెకు మరలఁ జైతన్యము వచ్చెను. అంతవా రిట్లు మాటలాడుకొనిరి.

చంద్రా—భగవతీ! నేను పాపము కట్టుకొంటిని. గడించిన శోకము నీకు జ్ఞప్తికిఁ దెచ్చి యిట్టియవస్థ గలిగించితిని. ఇంకను ఆవృత్తాంతము కట్టిపెట్టుము. నేను వినఁజాలను. నీవును గతించినదుఃఖము స్మరించికొని ప్రాణములుపోఁగొట్టుకొనకుము. ఒక్కొక్కప్పుడు గతదుఃఖము తలఁచికొన గుండెలు బెదర ప్రాణహాని సంభవించును.

మహా—రాజపుత్రా! ఆనాఁడు పోని యీపాడు ప్రాణములు నేఁడు పోవునా? యముఁడు కూడ నింతపాపాత్మురాలిమొగము చూడఁగూడ దని యెంచి నాదరికి రాఁడు గాఁబోలు. చెప్పుటకుఁగాని వినుటకుఁగాని యింతకంటెఁ గష్టతర మగువృత్తాంత మేమి యున్నది?

ఆమహావజ్రపాతానంతరము జరిగినవిచిత్రచరిత్రము చెప్పెదను వినుము. అందుఁ గలిగినదురాశ చేతనే యీపాప శరీరము ధరించియున్నాను. తరలికతోఁ "చితిపేర్చి నిప్పంటింపుము" అని చెప్పి భర్తృసహగమనము చేయ నిశ్చయించుకొని యుండఁగా ఆకస్మికముగా నొకదివ్యపురుషుఁడు వచ్చి పుండరీకునిదేహము తనబాహువులతో నెత్తికొని తీసికొనిపోవుచు "వత్సా! మహాశ్వేతా! నీప్రాణములు విడువకుము సుమీ. ఈతనితోఁ దిరిగి నీకు సమాగమము సంభవించును." అని చెప్పి యాకాశమున కెగిరిపోయెను.

ఆసందర్భ మంతయుఁ జూచి భయము నాశ్చర్యమును చెందినదియై కలఁగి కపింజలునిఁ జూచి "కపింజలా! ఏమిది?" అని యడుగుచుండఁగనే యాతఁడు తనపరికరములతో దరగా మూట గట్టుకొని పుండరీకుని దీసికొనిపోవు వానివెంటఁ బోయి ఓరిదురాత్మా! నామిత్రుని నెక్కడకుఁ దీసికొనిపోయెదవు? అని కేకలు వేయుచు నాతనితో నక్షత్రమండల మధ్యమునకుఁ బోయెను. కపింజలుఁడుగూడఁ బోవుటచే నా దుఃఖము ద్విగుణిత మయ్యెను.

"తరలికా! ఏమీవిచిత్రము." అని యడుగ నాపెయు స్త్రీస్వభావసహజ మగుభయముచేత వడఁకుచు "అమ్మా! ఏమి చెప్పఁగలను. నా కేమియుఁ దెలియదు. పాపాత్మురాలను. ఆవచ్చినపురుషుఁడు దివ్యపురుషుఁడే. అతఁడు చెప్పినది

యసత్యము కానేరదు. ఇది కీడులో మేలు. చక్కగా నాలో చించి చూడగా మరణము మంచిదో, జీవనము శ్రేయమో నిర్ణయింపను. ఆ దివ్యపురుషుని వాక్యము లసత్యము లని నిర్ణయమయ్యెనేని యప్పుడే మృతి నొందవచ్చు మరణము దుర్లభము గాదుగదా. నానిమిత్తమై వెళ్లిన కపింజలుడు తిరిగివచ్చునప్పటికి నీవు కనఁబడనిచో నాతఁడు బ్రతుకనొల్లఁడు. అంతదాక నయినఁ బ్రాణములు నిలఁబెట్టుకొనుము.

అని తరలిక బోధింప జీవితాశ సకలలోకసహజ మగుటను, దివ్యపురుషుని మాటలు నాశ గలిగించుటచేతను, తరలిక చెప్పినదే యుక్తమని యెంచి ప్రాణములు విడువక పాపాత్మురాల నయి యనురాగయాతనతో నారాత్రి గడపితిని. ఉదయకాలమున లేచి స్నానమాచరించి పుండరీకుఁ డుపయోగించు పరికర ముపయోగించుచుఁ దపము చేయఁ దొడఁగితిని.—

సంసార మనిత్యము. సర్వము క్షణికము. సర్వము దుఃఖమయము. దేహము బహుదుఃఖమూలము. ఈశ్వరుఁడే శరణము. అని భావించి పరమేశ్వరు నాశ్రయించి యిచట నుంటిని. మాతండ్రి నావృత్తాంతము విని దుఃఖించి యిక్కడకు వచ్చి నాహృదయము మరలింపఁజూచెను గాని తుదికి నిష్ఫలప్రయత్నుఁ డయి కొంతకాల మిచటనుండి నాయవస్థ చూడఁజాలక స్వగృహమునకుఁ బోయెను.

ఏడుపులతోఁ గన్నీటివిడుపులతోఁ బుండరీకుని యెడఁ

గలకృతజ్ఞతచూపును, తన్నామసంకీర్తనము చేయుచు, తన్నామములనే జపించుచు, కందమూలఫలజలములతోఁ గాలక్షేపము చేయుచున్నాను. పాపాత్మురాలను. కఠినురాలను. నిర్లజ్జను. నిరాధారను. నిష్ఫలజీవితను. నింద్యను. బ్రహ్మహత్యగట్టుకొనినమహాపాతకురాలను. అని వల్కలాంచలముతో మొగము గప్పుకొని బారున నేడ్చెను. చంద్రాపీడున కామెయందు మొదటనే గౌరవము గలిగినది. ఇప్పుడది యధికతరమయ్యెను.

అంత నతఁ డామెతో "భగవతి! సుఖమున్నను ముందడుగు వేయుటయు, క్లేశమున్న వెనుకడుగు వేయుటయు సకలలోకసమాజము. మృతునియందలిస్నేహమునకుఁ దగినపని చేయఁ గ్లేశపడలేక యేడుపుతో మాత్రము కృతజ్ఞతచూపుట సామాన్యజనరీతి. నీవట్లుగాక సకలైశ్వర్యములను జనకులను మిత్రులను విడిచి స్త్రీజనదుష్కరమగునరణ్యవాసము చేసి బ్రహ్మచర్యముపూని తప మాచరించుచున్నావు. భర్తగానీ భార్యగానీ సోదరుఁడుగానీ మిత్రుఁడుగానీ మృతులగుదురని వినినపుడు వానియందలిస్నేహమునఁ దనప్రాణములు వానియంతటనవే బోయినచోఁ బోవుఁగాక. ప్రయత్నపూర్వకముగా నిప్పులోనో నీళ్లలోనో యుఱుకి కొందఱు ప్రాణములు బోఁగొట్టుకొందురు. అది సనాగమున మని మహాకార్యముగాఁ గొందఱు పొగడుదురు. అది యజ్ఞాను లాచరించునిష్ఫలకా

ర్థము. అతిక్షుద్రము. దుఃఖము సహింపలేక తనదుఃఖనివృత్తికై చచ్చుట స్వార్థపరతయేకదా. ధైర్యము పూని తాను బ్రతికియుండి మృతుని బ్రతికించునుపాయము చూడవలయును. అది శక్యము గాదని తోఁచినపుడు మృతుఁడు సంకల్పించిన కార్యము నెఱవేర్పఁ బూనవలెను. ఆతనిపేరు శాశ్వత మగునట్లు ధర్మకార్యములు చేయవలయును. ఉత్తరజన్మమున నాతనికి మంచిగతులు గలుగునట్లు సత్కార్యము లాచరింపవలయు. అట్లుగాక తానును బలవంతముగాఁ జచ్చినచో ముందుమృతుఁడగువానికి లాభ మేమున్నది? తర్వాతఁ దన కేమిలాభము? పైపెచ్చు బలవంతపుఁజావు సచ్చుటచే నాత్మహత్యాపాపము చుట్టుకొనును.

మున్ను రతీదేవి తనభర్త హరనేత్రాగ్నిలోఁ బడి భస్మమైపోయినపుడు మృతినొందెనా? బ్రతికియుండి భర్తను బ్రతికించుకొన్నది పాండురాజు మరణించినపుడు పృథ యనుమరణ మొందెనా? సజీవయై యాతనికి భీష్మమగు సంతతిని గాపాడినది విరాటరాజకూఁతు రగు నుత్తర యభిమన్యుఁడు గతించినపుడు సహగమనము చేసెనా? బ్రతికియుండి వంశమునిలఁబెట్టినది.

అది యటుండ, పుండరీకు పునస్సమాగమము సంభవించునని దివ్యపురుషుఁడు చెప్పియుండె ననిచెప్పితివిగదా. అది విశ్వసనీయమే. దైవరీతి యతిచిత్రము. తపశ్శక్తు లనేకవిధములు. కార్యకారణభావము మనకు దుర్గ్రాహము. చిరకాల

మునుండియు నట్టివి జరుగుచునే యున్నవి. గంధర్వరాజపుత్త్రిక యగు ప్రమద్వర పాముకాటున మృతినొందఁగా రురునాముఁ డగుఋషి తనయాయుస్సులో సగ మిచ్చి మరల బ్రతికించుకొనలేదా. పుత్త్రుఁ డగు బభ్రువాహనుఁ డర్జునుని జంపినపుడు ఉలూపి పునరుజ్జీవితునిఁ జేసికొనలేదా. గర్భస్థదశయందే యశ్వత్థామాస్త్రములకారిఁ బడినపరీక్షిత్తునిఁ దల్లి మొఱవిని చక్రి రక్షింపలేదా. కృష్ణుఁడు సాందీపపుత్త్రుని యమపురినుండి వెనుకకుఁ దీసికొనివచ్చి తండ్రి కిచ్చె నని వినలేదా. ఇదియు నట్టిదే యగును. ఈశ్వరేచ్ఛ యెట్లున్నదో అట్లు జరుగును. కేవలము మనయిచ్ఛతో క్షణమయిన మనఁజాలము. దుఃఖించిన లాభ మేమి? నిన్ను నిందించుకొనిన లాభ మేమి?

అని యనేకోపదేశములు చేసి యామె నోదార్చి దోసిలితో నీరు తెచ్చి యిచ్చి మొగము గడుగుకొను మని నిర్బంధపఱుప నామె యట్లు గావించెను.

౫

సాయంసంధ్యాదులు తీర్చుకొని వారు కూర్చున్నతఱిఁ జంద్రగుప్తుఁడు "భగవతి! నీకాపద్బంధు వగుతరలిక యెక్కడకు వెళ్ళిన" దని యడుగ నామె యిట్లు చెప్పెను. "మహాశయా! అమృతసంభవ మగునప్సరసలకులమునఁ బుట్టినమదిర యనునామెను గంధర్వకులరాజగు చిత్రరథుఁడు పెండ్లాడెను.

ఆదంపతులకుఁ గూఁతు రుదయించెను. ఆమెపేరు కాదంబరి. నా కామె బాల్యమిత్రురాలు. మే మొక్కకంచములోఁ దిని యొకమంచమునఁ బరుండి యొకచోట నాడుకొని యొక్క గురువునొద్ద విద్య నేర్చుకొంటిమి. ఆమె నాదుఃఖవృత్తాంతము విని "నామిత్రురా లగుమహాశ్వేత దుఃఖములో నున్నంతకాలము నేను పెండ్లాడను. నాతల్లిదండ్రులు నిర్బంధము చేసెదరేని అనశనవ్రతమునన్, హుతాశనపాతమునన్, విషము తినియో, యురి పెట్టుకొనియో, యీశరీరము విడిచెద" నని చెలులయెదుట శపథము చేసిన దఁట. అది యామెతండ్రి విని యాప్రతిన విడువుమని యెన్నియుపదేశములో చేసినాఁడఁట. అవి యన్నియు వ్యర్థము లయ్యె నఁట. ఆదంపతులు ఏకపుత్రికామాత్రసంతానులుగాన మిగుల దుఃఖించి తుదకొకయుపాయము పన్ని క్షీరోదుఁ డనుకంచుకిని నాయొద్దకు నేఁటిప్రాతఃకాలమే పంపి యాతనిచేత "మహాశ్వేతా! నీయవస్థకే మేమెన్ని విధములనో పరితపించుచుండఁగా నీమూలమున మా కింకొక తాపము తటస్థ మయినది. కాదంబరి మనస్సును మరలించుట నీచేతిలోనే యున్నది." అని నాకు సందేశ మంపిరి. అప్పుడు క్షీరోదునితోఁ దరలికను బంపి "కాదంబరీ! దుఃఖతురాల నగుచున్న మఱియింత దుఃఖపెట్టెదవా? నేను బ్రతికియుండవలెనంటే నీవు పితృవాక్యపరిపాలనము చేయుము." అని కాదంబరికి సందేశ మంపితిని. నీవు వచ్చుటకుముందే తరలిక వెడ

లెను. అని చెప్పి యామె పరుండెను. చంద్రాపీడుఁడు పల్లవశయ్యపయిఁ బరుండి "ఈపాటికి వైశంపాయనుఁడు నేను తాలేదని పరితపించుచుండును. పాపము! పత్రలేఖ యే మనుకొనుచున్నదో. రాజవర్గము నాకై యెంతయెదురుసూచుచుండునో." అని యాలోచించి యాలోచించి నిద్రపోయెను.

మఱునాఁడు మహాశ్వేతయుఁ జంద్రాపీడుఁడును మాటలాడుచుండఁగా తరళికయుఁ గేయూరకుఁడును వచ్చిరి. కేయూరకుఁడు గంధర్వరాజగృహమునఁ జనవు గలిగిన యూనవర్గములోనివాఁడు. వారు మహాశ్వేతయొద్ద నున్న నూతనపురుషుఁ డెవ రని వింతగాఁ జంద్రాపీడునిఁ జూచుచు వచ్చి కూర్చుండిరి.

మహాశ్వేత—తరళికా! కాదంబరికి కుశలమా? నేను చెప్పినప్రకారము చేసెద నన్నదా?

తరళిక—రాజపుత్రీ! కాదంబరి క్షేమముగానే యున్నది. నీసందేశము విని కన్నులు కాల్వలుగట్ట దుఃఖించి ప్రతిసందేశ మీతనిచేఁ బంపినది.

కేయూ—మహాశ్వేతా! కాదంబరి గాఢాలింగనపూర్వకముగా నిట్లు మనవిచేయుచున్నది. "తరళికచేఁ బంపిన సందేశము వింటిని. అట్టిసందేశ మంపుటకుఁ గారణము గురుజననిర్బంధమా? వేఱొకటియా? ఇది వాత్సల్యదనమును పరీక్షించుటయా? నీవరణ్యములో దుఃఖమనుభవించుచుండ నేనింటి

లో సుఖముగానున్నా నని యన్యాపదేశముగా నిందించుట యా? ప్రేమలత త్రెంపవలయు నని యూహ కలిగినదా? నీ వంటిమిత్రురాలు దుఃఖములో నుండఁగా నేను మగనిఁ బెండ్లాడి సంసారసుఖ మనుభవించెద ననుకొంటివా? ఈవిషయమునఁ గన్యకాజనవిరుద్ధ మగుస్వాతంత్ర్య మవలంబించి, వినయము విడిచిపెట్టి పితృవాక్యోల్లంఘనము చేసితిని. నీపాదములు పట్టుకొని చెప్పుచున్నాను. అట్టిభావము స్వప్నమందయినఁ దలఁపకుము. మైత్రి రక్షింపు. నాజీవము సీతోడనే వనమునకు వచ్చినది.

మహా—(మిగులవిచారించి) కేయూరకా! నీవు వెళ్లు. నేను స్వయముగా వచ్చి చెప్పవలసినది చెప్పి చేయవలసినది చేసెదను.

అని చెప్పి మహాశ్వేత కేయూరకునిఁ బంపివేసి చంద్రాపీడునితో నిట్లనియెను. "మహారాజపుత్త్రా! హేమకూట మతిరమణీయము. చిత్రరథరాజధాని చిత్రవిచిత్రము. గంధర్వబృందము గాంచఁదగినదే. కాదంబరి సరళహృదయ. ఆమె దర్శనమును జేయవచ్చు. అవల గురుజనకార్యభంగము లేనిచో, అక్కడకు వచ్చుట శ్రమ మని యెంచనిపక్షమున, క్రొత్తదేశము చూడవలయునను కుతూహల ముండెనేని, పాపాత్మురాలనగు నాసహవాసము నీకిష్టమగునెడల, నాతోఁగూడ హేమకూటమునకు రమ్ము. కాదంబరిని జూచి యామెమనస్సు

కుదురుపఱచి రెండొకదినము విశ్రమించి తిరిగివత్తును. నీవు దయార్ద్రహృదయుఁడవు. అకారణబాంధవుఁడవు. నాదుఃఖము నీతోఁ జెప్పుకొనుటచేఁ గొంత సహ్యముగాఁ గనఁబడుచున్నది. సజ్జనసహవాసము దుఃఖితులనుగూడ నానందింపఁజేయునుగదా!

చంద్రా—భగవతీ! నీదర్శనము చేసినదిమొదలు నేను నీస్వాధీనుఁడ నయితిని. నీయిష్టప్రకారమే చేసెదను.

అంత వారిరువురును బయలుదేఱి కాదంబరీసన్నిధికి వెళ్లినప్పటికి కాదంబరి కేయూరకునితోఁ మాటలాడుచు "అతఁ డెవరు? ఆతనిరూప మంతసుందర మైనదా? వానివయస్సెంత? ఆతఁ డిక్కడకు వచ్చునా? అక్కడనుండియే స్వదేశమునకుఁ బోవునా? అని యడుగుచు మొగమెత్తిచూడ, మహాశ్వేతయు నొకసుందరపురుషుఁడును గనఁబడ, నాసుందరుఁడు, కేయూరకుఁడు చెప్పినవాఁడే యని రూపరేఖావిలాసములను బట్టి యూహించి ఱెప్పపాల్పక యాతనిఁ జూచుచుండెను. ఆచూపుతోనే యాతనిహృదయము వివశ మయ్యె. ఆమెహృదయము నట్లే యయ్యెను. అంత నామె సంభ్రమముతోఁ బ్రత్యుత్థానము చేయ నందఱును వచ్చి కూర్చుండిరి. మహాశ్వేత చంద్రాపీడునిఁ జూపుచు "కాదంబరీ! భరతవర్షమున తారాపీడుఁ డనుచక్రవర్తి గలఁడు. ఆతనిపుత్త్రుఁ డీతఁడు. చంద్రాపీడుఁ డని యాతనిపేరు. ఈతఁడు యువరాజపట్టాభిషే

కము నొంది దిగ్విజయము చేసి భూప్రదక్షిణము చేయుసంద
ర్భమున మన ప్రాంతములకు వచ్చినాఁడు. చూచినది మొదలు
ముఖ్యబంధువువలె నున్నాఁడు. నిష్కల్మషహృదయుఁడు. నేను
చూచి సంతోషించినట్లే నీవును చూచి సంతోషింతు వని
యిచ్చటకు రప్పించితిని. మనుష్యులలో ఎంతసౌందర్య
ము, ఎంతచాతుర్యము, ఎంతశ్రేష్ఠగుణములో! మనుష్యస్త్రీ
లెంతధన్యాత్ము[illegible]డ్రో నీకు తెలియ[illegible] యె[illegible] తీసికొని
వచ్చితిని. అపరిచితుఁ డని యాత్మలో సంకోచింపకుము.
క్రొత్తవాఁ డని సిగ్గుపడకుము. నాయం దెంతనమ్మిక యుంచెదవో
నీవితనియందుఁగూడ నంతనమ్మిక యుంచవచ్చును. అని చెప్ప
చుండఁగాఁ జంద్రాపీడుఁడు కాదంబరికి నమస్కారము చేయఁ
గా నామెయు సహాసముగాఁ బ్రతినమస్కృతి గావించెను. పరి
వారజనము తొందరగాఁ దెచ్చినసువర్ణపీఠముపైని వారిఁ
గూర్చుండఁబెట్టి వారిరువురును మంచముమీఁదఁ గూర్చుండిరి.

మహాశ్వేత కాదంబరి భుజాగ్రములపైఁ జేయివేసి "ఆరోగ్యమా" అని యడుగ "నారోగ్యమే" యని మహాశ్వేతకుఁ దాంబూల మీయఁబోవ మహాశ్వేత "కాదంబరీ క్రొత్తగా వచ్చినరాజపుత్రుఁడు మనకందఱకును ముందు మాననీయుఁడు. కావున ముందు తాంబూల మాతని కిమ్మనెను.

కాదంబరీహృదయ మాతనిని జూచినపుడే యస్వాధీన మయినది. లోలోపల ననురాగ మెక్కువయగుచుండెను

పైకి సిగ్గెక్కువయ్యెను. ఆతనికిఁ దాంబూల మిచ్చుటకు సిగ్గుపడి మహాశ్వేతతో రహస్యముగా “సఖీ! సిగ్గుగా నున్నది. నీవే యిమ్ము” అని తాంబూల మామెచేతి కీయఁబోవ నామె నీవే యిమ్మని నిర్బంధపఱచెను. ఆమెదృష్టి యంతయు మహాశ్వేతాముఖముపయి నిలిపి భయపడుచున్న దానివలెఁ గొంచెము వణఁకుచు నెట్లో తాంబూలమున్న చేయి చంద్రాపీడునివైపునకుఁ జాపెను. చంద్రాపీడుఁడును, అందుకొనఁ జేయి చాప “ఇదిమొదలు నాప్రాణములు, నాహృదయము, నాశరీరము, నాసర్వస్వమును నీచేతిలో నుంచుచున్నా నని తెలిపినట్లు తాంబూల మాతనిచేతిలోఁ బెట్టెను. చేయి మరలఁ దీసికొనునపుడు రత్నకంకణము జాఱిపోయెను. అదియు నామె యెఱుఁగదయ్యె. తర్వాత మఱియొక తాంబూలము మహాశ్వేతకిచ్చెను. వారు పరస్పరము సల్లాపముచేయ మొదలిడునంతలోనె యొకకంచుకి వచ్చి “మహాశ్వేతా! మహారాజదంపతులు నిన్నుఁ బిలుచుచున్నా” రని చెప్ప నామె వెళ్ళఁదలఁచి “కాదంబరీ! చంద్రాపీడుఁ డెక్కడ నుండవచ్చును.” అని యాడుగ “సఖీ! మహాశ్వేతా! అడుగుచున్నా వేమి? దర్శనము చేసినదిమొదలు నాప్రాణములు నాహృదయము నాశరీరము నాసర్వస్వము నాతనియధీనము చేసితిని. సర్వస్వమునకు నాతఁడే ప్రభువు. ఆతని కెక్కడ నిష్టమైన నక్కడ నుండవచ్చును. లేదా నీ కెక్కడ నచ్చిన నక్కడ నుంచవచ్చును. అన

మహాశ్వేత “ అట్లయినచో క్రీడాపర్వతముమీఁద మణిమందిరమున నుండ నేర్పాటు గావింపు ” మని చెప్పి వెడలెను. కాదంబరీపరివారము చూపినమార్గమున నాతఁడును మణిమందిరమున కరిగెను.

కాదంబరియు గొలఁదిపరివారముతోఁ బ్రాసాద మెక్కి యచటఁ దనలోఁ దాను దనమనమునఁ గలిగినచపలతనుగుఱించి యిట్లు తలపోసికొనెను. “ ఏమి యీసాహసము ! క్రొత్తవాఁ డని సంశయము లేదు. లోకు లేమందురో యను భయము లేదు. ఇంతకును ఆతనిహృదయ మెట్టిదో తెలియదు. ఆతఁడు నిరాకరించినచో నవమాన మగు ననుశంక లేదు. తల్లిదండ్రుల భావ మేమో తెలిసికొనవలయు నను భావమే కలుగలేదు. వీని కన్నిటికి నేమి ? మహాశ్వేత దుఃఖముతో నుండఁగాఁ బెండ్లియాడ నని చెలులయెదుటఁ బ్రతిజ్ఞ చేయుటయే గాక కేయూరకునిచే నంతకఠినముగా సందేశ మంపితినే అదియయిన నాలోచింపక ఆమహాశ్వేతయెదుటనే, ఆ కేయూరకుఁడు వినుచుండఁగానే యెంత తొందరపడితిని ! సర్వస్వమునకు నాతఁడే ప్రభు వని యామెతోనే చెప్పితినే ఆమె యే మనుకొనునో యని యయినను దోఁచలేదు. పరివారజనులు నన్ను నెంత తేలికస్వభావముగలదో యని యనరా ? అందును అంతఃపురదాసీజన మిట్టివి బయటఁబెట్టుటలో నతినిపుణము. ఈవిషయము విన్నచోఁ దల్లిదండ్రులును గంధర్వలోకము నేమందురో నా

ప్రతిజ్ఞకు భంగము గలిగింప నేదేవతకైనా? ఆతనిఁ బంపియుం డుదు. కాకపోయినచో ఆతఁడెవరో నేనెఱుఁగను ఎవ్వఁడయి నను విన్నానా? కన్నానా? అదేమి యద్భుతమో గాని వానిని జూచినంతలోనే చాంచల్యము గలిగినది. పోని యతి ప్రమాదము. ఇప్పుడయిన మనస్సు మరలరాదా ఎంత యత్నించినను మరలదే. ఆతనిదర్శనమునే యపేక్షించుచున్నది. అని యనుకొనుచుఁ గ్రీడాపర్వతమువైపున నున్న గవాక్షములోఁ గూర్చుండి యాసుందరాకారుని దివ్యసుందరవిగ్రహము మనఃఫలకమునఁ జిత్రించి చూచుచు నవ్వుచుఁ బలుకరించుచు, నానందపరవశ యయియుండెను.

చంద్రాపీడుఁ డచటఁ బరుండి "ఈగంధర్వరాజపుత్త్రిక విలాసములు స్వతస్సిద్ధముగా నున్నవా? ఇప్పుడు కారణాంతరమునఁ గలిగినవా? ఆయోరచూపు, ఆచూపులో బెళుకు, బెళుకులోఁ బ్రేమ, ప్రేమలో సిగ్గు, సిగ్గులో భయము, భయములో నందము, అందములో సరసత, సరసతలో జక్కని భావప్రకటనము. తాంబూల మిచ్చునప్పుడు చేసిన చేష్టచే నా ప్రాణము లర్పించుచున్నా నని స్పష్టపఱచెనుగదా. స్పష్టముగాఁ జెప్పను జెప్పినది! అనుకొని అంతలో సందేహము గలుగ, ఏమో అవి మర్యాదకు అన్నమాటలు కావచ్చును. ఆఁ. ఆఁ. ఎంతభ్రాంతి యౌవనమదము చేతనో, ఏకారణముననో నేనిటులు భావించుచున్నాను. మనుష్యుఁడనగు నే

నక్కడ? గంధర్వరాజపుత్రిక యగు కాదంబరి యెక్కడ? ఎంత భ్రాంతి. నిడముగా నామెకు నాయందు ప్రేమ గలిగె నేని క్రమముగా నదియే బయలువడును. అని నిశ్చయించుకొని లేచి కూర్చుండి గానాదివినోదములతోఁ గొంచెము సేపు కాలక్షేపము చేసి పర్వత మెక్కెను.

కాదంబరి ప్రాసాదగవాక్షమున నుండి యాతనిఁ జూచి "మహాశ్వేత వచ్చుచున్నదో లేదో ప్రాసాదశిఖర మెక్కి చూచెద నని వంక పెట్టి, యామె యానతిని కొలఁదిపరివారము మాత్రము తనవెంట నుండ, ప్రాసాదశిఖర మెక్కి క్రీడాపర్వతముమీఁద రాజపుత్త్రునిఁ జూచుచు, అతఁడు చూడ నానందించుచు చిర్యాసుఖ మనుభవించుచుండెను. మహాశ్వేత వచ్చిన దని ప్రతీహారి తెలుపఁ గ్రిందికి వచ్చి మహాశ్వేత కూడనున్నది గనుక యెట్లో భోజనాదికృత్యములు దీర్చెను. చంద్రాపీడుఁడును క్రిందికి దిగి పరిచారకులు చేయుపరిచర్యలు గ్రహించి సుజ్జుభోజనము లాచరించెను.

ఆసంతరము చంద్రాపీడుఁడు క్రీడాపర్వతమునఁ గూర్చుండి యుండ కేయూరకుఁడు, పాముమీసమువంటి తెల్లని సన్నని పంచెలచాపును, మదలేఖ హారమును, తరలిక పూజాద్రవ్యములున్న కొబ్బరిపూకులసజ్జయు పట్టుకొని కొలఁదిపరివారముతో వచ్చి కూర్చుండిన తర్వాత మదలేఖ రాజకుమారునకు జందనము పూసి పంచెలచాపు కానుకగా నిచ్చి మాలతీపు

వృవములదండ సిగకుఁ జుట్టి హారము చేతఁబట్టుకొని "రాజకు మారా! నీహృదయము ప్రేమపూర్ణము అప్రేమమే సర్వజనులను వశ్యులఁగా జేయును. సహజసుందర మగునీ యాకారమును, సహజమధుర మగునీసంభాషణమును ఎవ్వరిహృదయము నాకర్షింపదు? మా కాదంబరి హృదయమును ప్రథమదర్శనముననే వశముచేసికొంటివి. నీవు స్వయముగా వచ్చి దర్శన మిచ్చి యీ మెజన్మము ధన్యము గావించితివి. నీ కేమి ప్రత్యుపకారము చేయఁగలను. జీవితేశ్వరునకు వేఱె యిచ్చుట కేమి యుండును. అయినను ఈహారము పంపినది. ఇది తన యైశ్వర్యము చూపుటకుఁ గాదు. దీనికిఁ గొన్ని కారణము లున్నవి; చిత్తగింపుము. మున్ను సముద్రమథనసమయమున సముద్రములో నీరత్నము పుండి పోయినది. కావుననే దీనికి శేష హార మని పేరు. ఇది సముద్రుఁడు వరుణున కిచ్చెను. అతఁడు గంధర్వరాజున కర్పించెను. అతఁడది కాదంబరికి ప్రేమతో నొసఁగెను. ఇదిధరించుటకు నీశరీరమే తగినట్టి దని కాదంబరి భక్తిప్రేమములతో సర్పించుచున్నది. మహాశ్వేతయే తీసికొనిపోవలసినదే కాని మహాశ్వేత వచ్చుటకు వీలు లేక "కాదంబరీ ప్రథమస్నేహమునకు భంగము గలిగింపకు" మని తరలికచే సందేశ మంపినది. మిముబోటులకు సుగుణములే అలంకారములు గాని యిట్టివి కావు. అయినను కాదంబరియందు ప్రేమమున నిది ధరింపుము" అని హార మిచ్చెను.

అంతనతఁడు నది ధరించి మదలేఖా! ఏమి నీచాతుర్యము! మాఱుమాటాడ నవకాశము లేకుండఁగఁ జెప్పితివి. అదిగాక మీసౌజన్యమునకు నేను మీయధీనుఁడ నయితిని. మీయుపకారము చేయవలసినవాఁడనే కాని నాయిష్టానిష్ట విచారణ కవకాశమే లేదు. మీకాదంబరీ మహాశ్వేతల సుగుణసంపత్తి యట్టిది. మీరును వారివంటివార లేకదా. అని కొంతసేపు సల్లాపము లాడి వారికి సెలవిచ్చి పంపెను. ఆతఁడు క్రీడాపర్వతముపై నధిష్ఠించుట విని కాదంబరి ప్రాసాదశిఖరమెక్కెను. వారు పరస్పరవిలాసదర్శనమున దృఢతరానురాగులయిరి. తత్కాలోచితముగా ఏకావలిమాత్రిముధరించియితరాభరణములు తీసివేసి కాదంబరి కొలఁదిపరివారముతో చంద్రాపీడ దర్శనమున కేగెను. అందఱును శిలాతలముపైఁ గూర్చుండి సల్లాపము లాడిరి.

చంద్రా—దేవీ! ఈ దాసుఁడు దృష్టిప్రసాదమునకే సంతసించినాఁడు. అట్టివానికి సంభాషణమున కవకాశ మిచ్చి యనుగ్రహించితివి. వీనియందు సుగుణము లేశమయినను లేదు. ఇట్టిగౌరవపాత్రుఁడగుటకుఁ గారణము నీమంచితనమే. ఇంతకు సేవకునికి గౌరవ మేమి? ఈశరీరము పరార్థమే కదా! జీవితము తృణప్రాయము. వీని దేవికిఁ గానుకగా నర్పించుచున్నాను. వీనిఁ బరిగ్రహించి ధన్యునిగాఁ జేయవేఁడెదను.

మదలేఖ—రాజకుమారా! అంతగాఁ జెప్పనేల? మా

పక్షి మిగుల సిగ్గుపడి ప్రత్యుత్తరము చెప్ప సందేహించుచున్నది. మాటాడకున్నను పరిగ్రహించినట్లే. మరలమరల నీవిట్టి యుపచారవాక్యములు చెప్పుటచే సందేహము కలుగును. అని చెప్పి ప్రసంగవశమున వనవిహంగాదుల విశేషములును, శుకనాసికవిశేషములును, మనుష్యలోకవిశేషములును విని సంతసించి సెలవుగైకొనెను. ఎవరిస్థానమునకు వారరిగిరి. మఱునాఁడు కాదంబరీమహాశ్వేతలు చెలికత్తెలతోఁ గూర్చుండియుండఁ జంద్రాపీడుఁడు కేయూరకునితోఁ గలసి వారిసన్నిధి కరిగి వారికి నమస్కరించి కూర్చుండి మహాశ్వేత వైపునకుఁ జూచి చిఱునవ్వునవ్వెను. అంతమాత్రముననే యాతనిభావ మామె గ్రహించి కాదంబరీ! చంద్రకాంతమణి చంద్రకిరణప్రసారమునఁ గరఁగినట్లు చంద్రాపీడునిహృదయము నీదృష్టిప్రసారమునఁ గరఁగినది. ఈతఁడు స్వదేశమునకుఁ బోయెద నని చెప్పఁ జాలకున్నాఁడు. వెనుక దిగబడినరాజవర్గమును పరివారజనమును ఈతని వృత్తాంతము తెలియక దుఃఖించుచుండును. కను లిపికముల బాంధవులప్రేమము దూరమునం దున్నను అవిచ్ఛిన్నమే కదా. మీప్రేమము నట్టిదే నీవు సెలవిమ్ము." అని కాదంబరితో నన నామె "మహాశ్వేతా! నేను సెలవిచ్చుట కెంతదానను. అతఁడు సెలవిచ్చినట్లు చేయవలసినవారము మనము. ఆతనియాజ్ఞయే ముఖ్యము. అని. గంధర్వకుమారులఁ బిలిపించి యారాజకుమారునియాజ్ఞ శిరసావహించి కో

సపోటికిఁ గొనిపొండు అని యాజ్ఞాపించెను

చంద్రాపీడుఁడు లేచి నమస్కారపూర్వకముగా వారి కెలవు పుచ్చుకొని దేవీ! పరిజనముతో పాటు స్వస్థుఁడను. అనిబయలుదేఱి అచ్ఛోదసరోవరమున కరిగెను.

అంతకుఁ బూర్వమే యాతఁడు విడిచిపెట్టినపరివార మంతయు ఇంద్రాయుధాశ్వమునకుఁ గుఱుచూపిన బట్టి యచ్ఛోద సరోవరమునకువచ్చి శిబిరము నేర్పరచికొనియుండె. రాజకుమా రుఁడాపరివారము చూచి తనతోడవచ్చిన గంధర్వులను వెనుక కంపివచ్చి స్కంధావారజనము నమస్కరింపఁ దాముండఁ దగినశిబిరములోనికిఁ బోయెను. అతఁడు మహానందాశ్చర్యముల తో రాజలోకము నాదరించి సెలవిచ్చి పంపి వైశంపాయనుని తోను పత్రలేఖతోను, కాదంబరీమహాశ్వేతాదులప్రసంగము లు చెప్పుచుండెను. కాదంబరిని జూచినటుచే నాతనికి రాజ్యల క్ష్మియందు నిరసనము గలిగినది కాఁబోలు. ఆదృష్టియే లేదు. కాదంబరిని దలఁచుకొనుటంతే నే రాత్రియుఁ బవలును గడచినది.

మఱునాఁడు కేయూరకుఁడు రాఁగా చంద్రాపీడుఁ డతని నాదరించి కేయూరకా! కాదంబరీమహాశ్వేతలకు క్షేమ మా అని యడుగ క్షేమము. దేవరయిల్లనగుటచే విశేష క్షేమము. కాదంబరి నమస్కారపూర్వకముగా పంపించుచుండిన తాంబూలము లివిగో. కైకొనుము. మహాశ్వేత చెప్పినసందే శము చిత్తగింపుము.

"నీదర్శనమయినదినమే మాకు సుదినము. అట్టిసుది నము మరల మాకు లభించునా? నీవు వెడలినతర్వాత గంధర్వనగర ముత్సవశూన్య మయినట్లున్నది. నేను సర్వమును బరిత్యజించినదాననుగదా. అకారణబాంధవుండ వగు నిన్నుం జూడ నాహృదయముగూడ నభిలషించుచున్నది. ఎంతమరలించినను మరలకున్నది. కాదంబరి యస్వస్థశరీరయై యున్నది. నీస్మేరాననము స్మరించుచున్నది. మావంటివారలపరిచయమువలనం గలుగు గౌరవలోపము సహించి మఱియొకమాఱు దర్శనమీయ వేడుచున్నారము. నీసౌజన్యమే ఇట్టిసందేశము పంపుటకు మాకవకాశమిచ్చినది." అని సందేశము చెప్పి బట్టలోనున్నహారము తీసిచూపి దేవా! శయ్యమీఁద దేవర మఱచిపోయినహారమిది యని హారమీయ నాంశన స్వయముగా గ్రహించి ధరించెను. అంత రాజపుత్రమునకు సెలవిచ్చి కేయూరకు నశ్వశాలలోనికిం గొనిపోయి మూఁడవవాఁడు లేకుండఁగఁ జేసి "కేయూరకా! నేను వచ్చినతర్వాత జరిగిన వృత్తాంతము దెలుపు మన నతఁ డిట్లనియెను.

"దేవర బయలుదేఱినతర్వాతఁ గాదంబరి ప్రాసాదశిఖరమెక్కి దేవరను జూచుచుండెను. దేవరదృష్టిపథము దాఁటఁగా క్రీడాపర్వతమునకుఁ బోయి దేవర సంచరించిన చోటులను, దేవపూజగావించినప్రదేశములను, భుజించినస్థలమును పరిజనము

చూప నాదరముతోఁ జూచుచు, దేవరనుస్మరించుచు దేవర సాన్నిధ్యము కల్పించుకొని యెట్లెట్లో కాలముగడిపెను. రాత్రి శయనగృహమునకుఁ బోయినది మొదలు తలనొప్పి దాహజ్వరము మఱియు నేదో వ్యాధియు బాధింప నిద్రలేకయే రాత్రి గడపి ఉషఃకాలముననే నన్నుఁ బిలిపించి దేవరకీవార్త దెలుప నంపెను. చంద్రాపీడుఁ డామాటలు విన్నంతనే "గుఱ్ఱము గుఱ్ఱ" మన నాశ్వికు లింద్రాయుధాశ్వమును సన్నాహపఱచిరి. రాజకుమారుఁడు వైశంపాయనుని స్కంధావారమున నియోగించి పత్రలేఖను తనవెనుకఁ గూర్చుండఁబెట్టుకొని బయలుదేఱెను. కేయూరకుఁడు మఱొకగుఱ్ఱముమీఁద నాతనివెంటఁ బోయెను.

వారు కాదంబరీసన్నిధికిఁ జేర నొకతె "చంద్రాపీడుఁడు వచ్చినాఁడని తెలుపఁ గాదంబరి "నిజముగా వచ్చెనా? నీవు చూచితివా? ఎక్కడనుండె నని కన్నెత్తిచూడ వారామె కంటఁ బడిరి. వారి నామె యాదరముతో నుచితాసనములఁ గూర్చుండఁబెట్టెను. కేయూరకుఁడు పత్రిలేఖను కాదంబరికిఁ జూపి యీమె చంద్రాపీడుని తాంబూలకరండవాహినియగు పత్రిలేఖ యని తెలుప నామెను కాదంబరి చిరపరిచితయగుసఖిని బోలె నాదరించెను.

చంద్రాపీడుఁడు వారు చేయునుపచారములు గ్రహించి నామన స్సెంతయిష్టమో. ఇప్పటికి నమ్మకున్నది. ఏకసం

దేహమే. పోనీ కాదంబరినే యడిగెదను. అని తనలో వనుకొని పైకి « దేవి ! అంతతీవ్రవ్యాధి గలుగుటకు నిమిత్తమే మయియుండును. నిజముగా నీకంటె నాకెక్కువ దుర్భరముగా నున్నది. నీకు స్వస్థత గలుగుటకై నాదేహమయిన నర్పించెదను. నమ్ము. " అనియడుగఁ గాదంబరి సహజముగ్ధ యయ్యు నప్పటప్పటికిఁ గలిగినమనోవికాసముచే భావగర్భితముగు మాటలలోనిగూఢభావము గ్రహించి సిగ్గుచేత నుత్తరము చెప్పక మఱియొకవంకఁ బెట్టి చిఱునవ్వునవ్వి మదలేఖవైపు చూచెను. అంతట మదలేఖ «రాజకుమారా! యీమె సంతాపమతిదారుణము. బాధ కన్నులారఁ గాంచుచున్నావుగదా. ధైర్యముతోఁ బ్రాణములు నిలఁబెట్టుకొనియున్నది. అని చెప్పఁ గాదంబరి « యిదే తగినప్రత్యుత్తర " మని తనలోఁ దానముకొనెను.

ఆమాటలతోను సందేహము తీఱక చంద్రాపీడుఁడు కొంతసేపు కాలక్షేపము చేసి మహాప్రయత్నమున వారియనుమతి వడసి బయలుదేఱెను. పత్రలేఖగూడ నాతనితో బయలుదేఱిపోవుచుండ, మదలేఖ చంద్రాపీడునిఁ బలుకరించి « నేఁటికిఁ బత్రలేఖ నిచట నుండని " మ్మని రాజకుమారి కోరుచున్న దని మనవిసేయ నాతఁడు కేయూరకునితో «కేయూరకా ! పత్రలేఖ దేవీప్రసాదమునకుఁ బాత్రురాలయ్యెఁ గావున మిగులధన్యురాలు. ఆమె నేఁటి కిక్కడ నాఁగును. నీ

వాహమెను తర్వాతఁ దీసికొనిరమ్ము. నేను స్కంధావారమున్న చోటికిఁ బోయెద" నని చెప్పి వెళ్ళెను. పత్రలేఖయు, కేయూరకుఁడును మదలేఖతోఁ గలసి కాదంబరీసన్నిధి కరిగిరి.

చంద్రాపీడుఁడు స్కంధావారము చేరునప్పటికిఁ దండ్రిపంపిన లేఖలు పట్టుకొని లేఖహారకుఁడు వచ్చియుండెను. తల్లిదండ్రులక్షేమమును శుకనాసాదులక్షేమము నాతని నడిగి తెలిసికొని యాతఁడిచ్చినయుత్తరములు పుచ్చుకొని మొదట నొకమాఱు శిరమునదాల్చి యొకటివిప్పి చదువ నందిట్లుండెను.

"స్వస్తి ఉజ్జయినీపురమునుండిపరమమాహేశ్వరమహారాజాధిరాజదేవతారాపీడమహారాజులు సర్వసంపదాలయుఁడగుచంద్రాపీడునిశిరమునముద్దుపెట్టుకొనిసంతసించుచున్నారు. ప్రజలకందఱకును కుశలమే కాని నిన్నుఁ జూచి యెంతో కాలమయినది. మాహృదయము నిన్నుఁ జూడఁ దహతహపడుచున్నది. మీతల్లియు బెంగపెట్టుకొన్నది. ఈలేఖ చదివినయుత్తరక్షణమే ప్రయాణమయి రావలెను."

అని యున్నయుత్తరము చదివి రెండవది విప్ప నందునను నదేభావము శుకనాసుఁడు వ్రాసిపంపె నని గ్రహించి, వైశంపాయనుఁడు తనపేర శుకనాసుఁడు వ్రాసినయుత్తరములోను నదేభావ మున్న దని తెలుప విని, పితాజ్ఞ దాఁటరా దని వెంటనే ప్రయాణపటహము కొట్టించి, గుఱ్ఱమెక్కి, మేఘనాదునిఁ బిలిచి "మేఘనాథా! నీవిక్కడనే యుండుము. కే

యూరకుఁడు పత్రలేఖ నిక్కడకుఁ దీసికొనివచ్చును. నీవా మెను వెంటఁబెట్టుకొని యుజ్జయినికి రమ్ము. కేయూరకునిచేఁ గాదంబరికి నామాటలుగా నిట్లు సందేశము చెప్పుము.

“ దేవి! మనుష్యస్వభావము దుష్టము. నిన్ను మోసముచేసి పోవుచున్నాను. నిన్ను మోసముచేసినవానికంటె మహాశ్వేతను మోసముచేసినందులకు సిగ్గుపడుచున్నాను. ఇంతకు నేమిచేయఁగలను. గుర్వాజ్ఞ ప్రబలతరము. అయినను అది దేహమునుమాత్రమే వశపఱచుకొనును గాని హృదయమును స్వాధీనపఱచుకొనఁజాలదు. హేమకూటనివాసమందే నాకు వ్యసనము. నాహృదయము కాదంబరికి జన్మాంతరసహస్రములదాఁక దాస్యపత్త్రము వ్రాసి యిచ్చినది. ఏమయినను జనకునియాజ్ఞ దాఁటలేక యుజ్జయినీపురమునకుఁ బోవుచున్నాను. దుర్జనులపరిసంగమువచ్చినపుడు చంద్రాపీడచండాలుఁడు స్మరింపఁదగినవాఁడు. చంద్రాపీడుఁడు బ్రతికియుండఁగా దేవిపాదారవిందవందనానంద మనుభవింపఁగలఁడని యెంచకుము ” ఈసందేశము చెప్పి తర్వాత మహాశ్వేతాదులకు నానమస్కారముదెల్పు ” మనుము. అని మేఘనాదునితోఁ జెప్పి వైశంపాయనుని స్కంధావారమున నియోగించి కాదంబరీవియోగవశమున శూన్యహృదయుఁడయ్యు దనతో వచ్చువార్తాహరుని నుజ్జయినీవార్త లడుగుచుఁ గొంతసైన్యముతోఁ బ్రయాణముచేసి కొన్నిదినములకుఁ బురమునకుఁ జేరెను.

౬

ఆకస్మికముగా వచ్చిన రాజకుమారునిఁ జూచి యం దఱు నధికానందమొందిరి. రాజు కుమారుని కౌఁగిటఁ బోయి యాతఁడు నమస్కరింప రారమ్ము కుమారా! యని గాఢాలింగనము చేసికొనెను. రాజకుమారుఁ డక్కడ నున్న పెద్దలందఱకు నమస్కరించి తండ్రియనుమతిని తల్లిదర్శనము చేసి యామె నానందింపఁ జేసి మంగళాశీర్వాదములు వడసి యచటనుండి శుకనాసునింటికిఁ బోయి యాతనికి నమస్కృతి చేసి వైశంపాయనుని స్కంధావారమున నియోగించి వచ్చితి నని చెప్పి వైశంపాయనునితల్లినిఁ గూడఁ జూచి యామెకుఁ గుమారునివార్త తెలిపి మరల మాతృగృహమునకుఁ బోయి యచ్చట స్నానభోజనాదిక మాచరించి యపరాహ్ణమునఁ గుమారభవనమున కేగెను. కాదంబరిని దలపోయుచుఁ, గాదం బరి సన్నిధిని లేనిజీవితము వ్యర్థ మనియెంచుచు నచటఁ గొన్నిదినము లెట్లో కాలక్షేపము చేయుచుండ నొకనాఁడు మేఘ నాదుఁడు పత్రికలేఖను వెంటఁ బెట్టుకొనివచ్చెను.

స్వతస్సిద్ధముగానే రాజకుమారునకుఁ బత్రలేఖయం దుఁ బ్రీతి గలదు. నేఁడు కాదంబరిసన్నిధినుండి వచ్చుటచే నది యధికమయ్యెను. మేఘనాదుని హాస్తస్పర్శముతో నాద రించి పత్రలేఖవలనఁ గాదంబరీమహాశ్వేతలక్షేమ మరసి మే ఘనాదుని విశ్రమింపఁ బంపి రాజవర్గమునకు సెలవిచ్చి కాదం

బరీవార్తావిశేషములు దెలిసికొనఁ దహతహపడుచుఁ బరివార మును నివారించి పత్రలేఖతోఁ బత్రిమండపమునఁ గూర్చుండి "పత్రలేఖా! నేను వచ్చినతర్వాత నేమి జరిగినది. ఏదిం గోష్ఠి వచ్చినది. సవివరముగాఁ దెలుపుము" అన నామె యిట్లు చెప్పఁదొడఁగెను. "దేవ! సావధానముగఁ జిత్తగిం పుము. నాఁడు దేవర వెళ్లినతర్వాతఁ గేయూరకునితో నేను కరుఁబోయి కాదంబరీదేవిసమీపముననే కూర్చుంటిని. దేవి నాయెడలఁ జూపినయాదర మింత యని చెప్పఁజాలను. అప రాహ్ణమయినతర్వాత నితరపరివారమును నిషేధించి నన్ను మాత్రము వెంటఁబెట్టుకొని యుద్యానవనములోనికిఁ బోయి యొకమణివేదికపై మణిస్తంభమునఁ జేరఁబడి యేదో నాతోఁ జెప్పఁబోయి మరలసందేహించి రెప్పపాటులేక నావంకఁ జూచుచుండెను. నే నామెభావము గ్రహించి "దేవి! ఏమి సెలవు? చెప్పఁదలఁచినది చెప్పుము. చెప్పఁబోయినది చెప్ప కున్నచో నెదుటివారికి బాధగానుండును గదా." అన మరలఁ జెప్పఁ నుద్యుక్తయయి గద్గదస్వరమువడి చెప్పలేకుండెను.

ఆమె హృదయమున నెందులకో దుఃఖ మనుభవించు చున్న దని నాకుఁ దోఁచినది. ఆమెను గుచ్చిగ్రుచ్చి యడి గితిని. అంత నామె "పత్రలేఖా! నిన్నుఁ జూచినది మొద లుకొని, కారణము తెలియకుండగాని, చెలికత్తెలలో నెవరియం దును లేనిప్రీతి నీయెడఁ గలిగినది. నాతల్లిదండ్రులయందు తుది

కిమహాశ్వేతయందుఁగూడ నాకింత ప్రీతి లేదు. నాకష్టములు నీతోఁ జెప్పక యింక నెవరితోఁ జెప్పుకొనెదను. జీవితము మీఁద నొట్టుపెట్టుకొని చెప్పుచున్నాను. ఇతరులమాట కేమి నాహృదయమునకు గూడఁ దెలియనిచ్చుట నాకిష్టము గాదు.

నావలె నెవతె కులమునకుఁ గళంకము తెచ్చును? నావలె సిగ్గువిడిచి యెవతెయైనఁ బ్రవర్తించునా? ఆతనికి నన్ను నాతల్లిదండ్రు లీయలేదు. పెద్దలనుమతింపలేదు. ఆచం ద్రాపీడుఁడు నన్నుఁ దలయెత్తుకొని తిరుగకుండఁగఁ జేసినాఁ డుగదా. ఏమొగము పెట్టుకొని వారిముఖము చూడఁగలను. ఇదేకాఁబోలు గొప్పవారికిఁ దగిననడవడి? పరిచయము చేసినం దుల కిదా ఫలము? అట్టికళంకమును బరాభవమును బోఁగొ ట్టుకొనుటకుఁ బ్రాణత్యాగమే ప్రాయశ్చిత్తము. నిన్ను జన్మాం తరమునఁ గలసికొందును." అని యూరకుండెను.

నాకు మీవృత్తాంతమేమియును దెలియదుగాన సిగ్గు పడి అంతలో భయపడి క్రమముగా వింతపడి "దేవి! చం ద్రాపీడుఁడు చేసినదేమి? నీమన స్సెంత నొవ్వఁ జేసినాఁడు? అదేమో చెప్పుము విని ముందు నేను ప్రాణములు పరిత్యజిం తును. తర్వాత నీవు నట్లు చేయవచ్చు అన నామె "సఖీ! స్వప్నమున వచ్చి శుకశారికలముఖమున దౌత్యము నడుపు చున్నాఁడు ధూర్తత-చూపుచున్నాఁడు. అల్లరిచేష్టలయే యా తనికి గొప్ప యనితోఁచినది కాఁబోలు ఎంతెంత దుండగ

ములు ? ఏమి చెప్పను."

అని చెప్పుచున్న యామెమాటలు విన నాకెంతయో సంతసము గలిగినది చంద్రాపీడుని రూపదర్శనాభిలాషము లు సఫలము లయిన వని యనుకొని దేవి! కోపము విడిచి ప్రసన్నురాల వగుము. అతని దూషింపకుము! ఈచేష్ట లాతఁడు చేసినవి కావు. అవి చేయించినవాఁడు వేఱు. అన నామాట వినినంతనే కాదంబరి అవి యన్నియు నాకుఁ జెలి యవు. నీ విప్పటికిఁ దగినమార్గ మేదియో యుపదేశింపుము. నిందాపాత్రముగు నిట్టిజీవితముతో నుండుటకంటె మరణమే మంచి దని నాకుఁ దోఁచినది, అని దుఃఖింప నే నోదార్చి "దేవి! చాలుఁజాలు. దీనికై మరణప్రయత్నమా? పెద్దలు ఏమని నిందింతురు? ఇట్టివివాహములలోఁ బెద్దల యనుమతి గాని తలిదండ్రులు దానముచేయుట గాని యక్కఱ లేదు. కన్యకయే సర్వస్వతంత్రురాలు. లేకున్నచో శాస్త్రములయం దు స్వయంవరవిధియే వ్యర్థమగును కావున నీవట్టిసందేహము విడిచి నాచే సందేశ మంపుము. నేను నీపాదములు పట్టి చెప్పుచున్నాను. నేను చంద్రాపీడునిఁ దీసికొనివచ్చెదను. నన్నుఁ అన నామె "సఖి! సందేశ మేమి పంపుదును? అతిప్రియుఁడ వందునా పునరుక్తియే. నిన్నుఁ బాసి బ్రతుకఁజాలనందునా నేని యనుభవవిరుద్ధ మది. చెప్పక రావలెనంటినా సౌభాగ్యగర్వ మని తోఁచునేమో. నేనే వచ్చెద నన్నచో స్త్రీచపలత ప్ర

కటిత మగును * నీ వాతనిని దీసికొనివచ్చినను లజ్జ నన్నాతనిం దరవదనునిదర్శనము చేయనీయదు. ఆరాజకుమారుఁడు పెద్దలకుఁ దెలిసిపోవు నను సంశయముననో రాచకార్యముల నిర్బంధము చేతనో జన్మభూమిని బాల్యమిత్రులను తల్లిదండ్రులను విడువనొల్లకయో ప్రయాణఖేదము సహింపనొల్లకయో నాయందుఁ బ్రీతి లేకయో రాకున్నచో నీప్రయత్నమును ప్రయాసమును వ్యర్థములగునుగదా. ఇంతకును మునుపుచూచినకాదంబరి యేకదా. ఆతని మనస్సెట్లున్నదో" అని నాతోఁ జెప్పుచునే మూర్ఛ నొందెను.

నే నామె నోదార్చుచు "సఖీ! వ్యర్థముగా నాత్మను ఖేదపెట్టుచున్నావేమి? ఇదిగో! చంద్రాపీడునిఁ దీసికొనివచ్చితి నన్నమాట అవ దేవరనామాక్షరశ్రవణమాత్రముననే మూర్ఛనుండి తేరి చంద్రాపీడుఁ డేఁడీ యని యడిగి కన్ను దెఱచి నన్నుఁ జూచి కొంచెము సిగ్గుపడి "సఖీ! పత్రలేఖా! ఇచ్ఛకము లాడుచున్నా వని యనుకొనకుము. నీయందలి ప్రీతిచేఁ బ్రాణములు నిలఁబెట్టుకొంటిని. లేకున్నచో నీపాటికిఁ బ్రాణములు పోవలసినదేసుమీ. నీకుఁ దోఁచినట్లు చేయుము. అని తాంబూల మిచ్చి నన్నుఁ బంపెను.

అని పత్రలేఖ చెప్పి తలకొంచెము వంచుకొని యిట్లు పలికెను. "దేవ! కాదంబరీప్రసాదమువ ధైర్యముగాఁ జెప్పుచు

* ఇంతవఱకే బాణుని విరచనము. కడమది అతని పుత్రుఁడు రచించినది.

న్నాను. నాకుఁగూడ దుఃఖము వచ్చినది. ఆమె నంతస్థితికిఁ దెచ్చి యొంటరిగా విడిచి దుఃఖపెట్టుట యాపన్న రక్షకుఁడవగు నీకుఁ దగునా? చంద్రాపీడుఁడు నిందాగర్భములగు నామె మాటలు విని మనమున వికలతనొంది "పత్రలేఖా! ఏమి చేయను? నామూలమున నామె కెంత బాధగలిగినది? ఆమెవిలాసములును చేష్టలును చూచి యవి గంధర్వకన్యకలకు సహజము లేమో యనుకొంటిని. స్పష్టముగాఁగనఁబడుచున్న విషయమునఁగూడ సంశయముగలుగుట పాపఫలమో, శాపఫలమో కావలయును. విలాసములమాట యేల? తన మెడలోని హారము నాకిచ్చినదిగదా! హిమగృహమున జరగినదంతయు నీవు ప్రత్యక్షముగాఁ జూచితివిగదా. దేవిఫలమున నేమి? నాదేతప్పు. నేను కఠినహృదయుఁడ నని యామె స్థిరపఱచుకొనకముందే నాప్రాణము లర్పించియయిన నామెకోర్కె తీర్చెదను." అని చెప్పుచుండఁగా ప్రతీహారి వచ్చి "యువరాజా! అమ్మగారు నిన్నును పత్రలేఖను జూడఁ గుతూహలపడుచున్నారు. వెంటనే రావలయు నని." అని చెప్పెను.

చంద్రాపీడుఁ డామాటలువిని "ఆహా! నాహృదయమూఁగులాడుచున్నది. జనని ఋణమున నన్ను విడిచియుండ లేదు. మాతృస్నేహము జన్మప్రభృతియున్నది. కాదంబరీస్నేహము నూతనమయ్యు నవ్యాజము. పితృపాదసేవయుఁ బ్రజానురాగమును దుస్త్యజములు. గంధర్వరాజపుత్రికానురాగ

ము పరిబలతమముగా నున్నది. మనస్సు కాలాతిపాతమును స
హింపజాలదు. ఎక్కడి హేమకూటము ? ఎక్కడి వింధ్యపర్వత
ము ? " అని తలపోయుచుఁ జిత్రలేఖతోఁ గలసి మాతృదర్శ
నమున కరిగెను. అతిగంభీరుఁడగుటచే హృదయస్థితి యొరులకుఁ
దెలియకుండఁగ నట్లో కాలక్షేపము చేయుచుండెను.

ఒకనాఁడు శిప్రానదీతీరమునఁ గుమారస్వామి యాల
యసమీపమున పత్రలేఖయుఁ జంద్రాపీడుఁడును వినోదార్థ
ము విహరించుచుండ, కేయూరకుఁడు పురమునకుఁ బోవుచుఁ
జంద్రాపీడుఁ డక్కడనుండెనని తెలిసికొని యాతని దర్శనము
చేసెను. చంద్రాపీడు డతని నాదరించి కాదంబరీక్షేమము తెలి
సికొని యాతనిని, పత్రలేఖను తనతో పాటు గజముపై నెక్కిం
చుకొని స్వభవనమున కరిగెను. ఇతరులకు సెలవిచ్చి పంపి
రాజపుత్రుఁడు వారిద్దరితో మాటలాడుచుండెను.

చంద్రా—కేయూరకా ! కాదంబరియు మహాశ్వేత
యు మదలేఖయుఁ బంపిన సందేశ మేమి ?

కేయూ—దేవా ! ఎవ్వరును సందేశము నంపలేదు. జరి
గిన విషయమును వినుము. నేను పత్రలేఖను మేఘనాదునకప్ప
గించి వెనుకకుఁ బోయి దేవర యుజ్జయినీపురమునకు దయచేసి
న వార్త తెలిపితిని. ఆ వార్త చెవినిబడినంతలోనే మహాశ్వేత
వేఁడినిట్టూర్పు విడిచి తపస్సు చేసికొందు నని యరణ్యమునకుఁ
బోయెను. పిడుగడచినట్లు, నామాటలు కాదంబరిని గ్రుంగఁజే

సినవి. ఆమె మూర్ఛపడి మహాశ్వేత విస్ఫోటకూన నొఱుఁగ కుండెను. నేనును, మదలేఖయు నుపచారములు చేయఁ గొం తసేపటికి సేదఁదేరి మహాశ్వేత వెళ్ళిపోయినదని విని యామె తో నాయవస్థ యిట్లున్నదని చెప్పుమని నాతోఁ జెప్పెను. మదలేఖతో "సఖీ! చంద్రాపీడుఁ డెంతపని చేసినాఁడే ఇంతరుఁ డింతపని చేయు గలఁడా" అని తనయవస్థయంతయుఁ దెలు పుచుండెను. మఱునాఁడు నేను దర్శనమునకుఁ బోయినపుడు కోపముతోఁ జూచి మీరందఱు నుండఁగా నే నియవస్థ యను భవింపవలసిన దేకదా మీకున లాభ మేమి? పో! నాయెదు టనుండకుము." అని దేవరదర్శనమునకుఁ బొమ్మని సెలవు నట్లు భావించి నేనిచ్చటికి వచ్చితిని. ప్రియసమాగమాశ యే యామె ప్రాణములను నిలఁబెట్టినది. ఆ సౌభాగము గలిగె నేని ప్రాణభ గముగూడఁ గలుగవచ్చు. ఏపరిసంగము వచ్చినను దేవరపరిసంగ మేకదా.

చంద్రాపీడుఁడు కేయూరకా! ఇంకఁ జెప్పకుము వినఁజా లను. అని మూర్ఛనొంది వారియుపచారములఁ దెలిని మూర్ఛఁ దేరి యిట్లనియెను.

కేయూరకా! నాకుఁ గాదంబరిమీఁద ననురాగము లేదనియో లేదా, నేను కఠినహృదయుఁడనని యో కాదంబరి యెంచియుండును లేకున్నచో సందేశ మేలపంపదు. మహా శ్వేతా మదలేఖలయినను సందేశ మంపరైరి. పత్రలేఖ యుం

తయుఁ జెప్పినది. కాక, కాదంబరి గంభీరురాలు. ఆమె అభి రస్పందము చేసినను అజ్ఞగా నెంచి యభీష్టము కాఅవేక్ష్య దాసు సిపము నామె కంతసందేహ మేల? లేక సిగ్గుపడినదో ఇంత కును నామూలమున నామె బాధలు పొందవలసినవిధి యున్నది కాఁబోలు. లేకున్నచో సిప్ప్రియోజనముగ గంధర్వమిథున మును వెంటాడి నిర్జనారణ్యమునకు రానేల? అచ్చట దప్పిక కలుగనేల? అచ్ఛోదసరస్సీరమునకుఁబోనేల? సంగీతమేల వినఁబడవలె? మహాశ్వేతాదర్శన మేలప్రాప్తింపవలెను. ప్రాప్తించినను అచటనుండిపోక కాదంబరీదర్శన మేల చేయవలయును. ప్రేమోదయ మేలకలుగవలెను. అంతలోనే జనకాజ్ఞ రావలెనా? నేను వెంటనే పురమునకు రావలెనా? అంతయుఁ బూర్వకర్మానుసారముగా విధిసంభవింపఁజేసెను. అయినను, దేహయాత్ర దాఁటను. నేనువచ్చునంతదాఁక నామె ప్రాణములు ధరించియుండునా? మదలేఖతో నుపచారములు చేసి యామె ప్రాణములు నిలఁబెట్టుమని నేను చెప్పినట్లు పత్త్రము? మహాశ్వేత దగ్గఱనయిన లేదా! అయ్యో.

కేయూ—రాజకుమారా! ఎవ్వరున్ననేమి. ఆమె చూపు-నీరూపునే చూచుఁగోరును. ఇతరులపైఁ బ్రసరింపదు. అని చెప్పుచుండఁగా రాజకుమారుఁడు కేయూరకుని విశ్రాంతిగొనుమని సెలవిప్పించి తనలోదా నిట్లు తలఁచుకొనుచుండెను.

మూను. నేను రు వచ్చెదను. పత్రలేఖను గూడ నీవెంటఁ దీసి
కొని వెళ్ళుము" అనఁగా, కేయూరకుఁడు 'చిత్తము' అనెను.

చంద్రాపీడుఁడు మేఘనాదునిఁ బిలిపించి పత్రలేఖను
మున్ను దీసికొనివచ్చిన చోటికే మరలఁ దీసికొనిపోయి దిగఁబె
ట్టుము. కేయూరకునిఁగూడఁ గొనిపొమ్ము. నేను వైశంపాయను
నిఁజూచి మాటలాడి వచ్చెదను. అని యాజ్ఞసేసెను.

అది పత్రలేఖకుఁ దెలిసెను. ఆమె రాజపుత్రుని విడిచి
పోవలసివచ్చినందులకు దుఃఖముగలిగెను అమంగళమని కం
టఁదడిపెట్టక రాజపుత్రుసన్నిధికి వచ్చినిలఁబడ "పత్రలేఖా!
దేవీ ప్రాణములు నిలఁబెట్టుటకై నిన్ను ముందు పంపవలసివచ్చి
నది ఆమెప్రాణములున్నఁగదా నాప్రాణములు నిలుచుట.
ఇప్పుడా ప్రాణములును నీచేతిలో నున్నవి." అని చెప్పి కేయూ
రకునితో "కేయూరకా! నేను మహాశ్వేతాశ్రమమునకు
వచ్చునప్పటికి నన్నుఁ దీసికొనివెళ్ళుటకై నీవక్కడ నుండుము.
అని యాదరముతోఁ బలికి వారికి సెలవిచ్చి పంపెను.

చంద్రాపీడుఁడు వైశంపాయనుని కెదురుగాఁ బోయి
తీసికొనివచ్చుటకు రాజాజ్ఞ నొంది కొలఁదిపరివారముతో
వచ్చుటకు మూఁడామడదూరమునున్న దశపురమున కరుగ
నచట స్కంధావారము విడిసినస్థలము గనఁబడెను.

ముందు వార్త పంపకుండఁగ, నాకస్మికముగా వైశం
పాయనుని గలిసికొనఁ దలఁచి పరివార మొకచో నుండనియ

మించి, నలుగురు గుఱ్ఱము లెక్కి తనతో రాఁగా ఇంద్రాయుధాశ్వమును నెక్కి మాఱువేషముతో నొంటిగఁ గదలి «వైశంపాయనుఁ డుండు గృహమేది" అని సామాన్య స్త్రీల నడుగఁ గొందఱు స్త్రీలు కంట నీరు వెట్టుచు «వైశంపాయనుఁ డెక్కడ నాయనా ?" అనిరి.

అది వినఁగానే చంద్రాపీకుని హృదయము తరయూ ఖేదమొందెను. వారు తెలివితక్కువచే నట్లు చెప్పిరనుకొని యితరుల నడుగుటకంటె కలమాత్యునకుఁ బోయి యడిగినఁ దెలియు నని యక్కడకుఁ బోవ, నిద్రాముఖమును బట్టి రాజవర్గము చంద్రాపీకుని గుర్తించి నమస్కరించి వైశంపాయనుఁ డేఁడీ అని యడిగెను. వారు తెలతెల్లపోయి మా మాన రాజకుమారా! మనవిచేసెదము. ఈతని తెలియదు. దయచేయుడను అనిరి. ఆమాటలతో అతనిహృదయము భిన్నము గుఱ్ఱముమీఁద నుండఁగనే మూర్ఛనొందెను. వారు వానిఁ దింపి, పరుండఁబెట్టి, యుపచారములు సేయఁ గొంతసేపటికి సేదదేరి ఏఁడీ వైశంపాయనుఁడు? ఆమార్గమధ్యమున నేవైనయుపద్రవము సంభవించెనా? ఏమహావ్యాధియైన వానిఁ బ్రాణము గొనెనా? హా! హా! మిత్రరత్నమా! యని వాపోవసాగు ఎడగా ట «శాంతం పాపం శాంతం పాపం" అని చేతులఁ జెవులు మూసికొని యాతఁడు దేవరతో పాటు నూఱేండ్లును జీవించువాఁడే యనిరి.

ఆ వాక్యమ్ము వినుము చెప్పలఁ బడఁ బునర్జీవితుఁ డయి యాతురతతో ఏమి! వైశంపాయనుఁడు జీవించియుండెనా? ఎక్కడ నున్నాఁడు? పరక్కి నుండి యేయరణ్యమునకైనఁ బోయెనా? మీరు నిశ్చయపెట్టి యేల తీసికొనిరాలేదు అని యుతుగ వారిట్లు చెప్పఁదొడఁగిరి

దేవా! పావనాశముగాఁ జిత్తగింపుము. దేవర బయలుదేఱినపుడు స్కంధావారాధికారిగా వైశంపాయనుని నియోగించితిరిగదా. ప్రయాణభేరి మ్రోఁగించి యాఁదఱును సన్నద్ధులమయియుండ వైశంపాయనుఁడు వచ్చి "అచ్ఛోదసరస్సు పుణ్యతీర్థమని పురాణప్రసిద్ధి. అక్కడకుఁ బోయి యందు స్నానము చేసి పోవుదము.'' అప్పుడంతా నే బయలుదేఱి నందఱము నక్కడ వెళ్లితిమి. అతఁ డలచ్చాయుండి నాగులయాభోగము జూచి యానందించుచు గతజన్మమునందేదియో జ్ఞప్తికి వచ్చినట్లు స్మరించుచు, చిరకాలము నివసించిన ప్రదేశము విడిచి దూరదేశము పోయి, మరల వచ్చి పూర్వనివాసస్థలము చూచినవానివలెను, చిరకాలవియుక్తుఁడగు సోదరునిఁ గలసికొనినవానిఁబోలెను మనమున నేదియో తలఁచికొనుచుండెను. రసికహృదయములు మనోహరపదార్థము గనఁబడినపుడు తదాసక్తము లగుట సహజము. అందును కుతూహలస్థానముగ [illegible] ఆ సరస్సు. దాని సౌందర్య మాతనిమనము నాకర్షించెనని యనుకొంటిమి.

పడిపోయినరత్నమును వెదకువానివలె మూలమూలల

నేదో వెదకుచుండెను. "స్కంధావారము ప్రయాణసన్నద్ధమై యున్నది. ఇంకను విలంబమేల సేయుదువు" అని మే మనఁగఁ జెవిటివానివలె వినిపించుకొనఁడయ్యె. మూగవానివలె మాటాడఁడయ్యె. సమాధానము చెప్పవా యని నిర్బంధపెట్టఁ దుదకు విసువుకొనుచు "మీ రందఱును పొండు. నే నీప్రదేశము విడిచిరా నొల్లను. పొండు." అని చెప్పెను. ఈతనిమనస్సు ఏలకో యాకస్మికముగా విరక్తమైనది. యని యెంచి "దేవర మాటచెప్పినచో మరలునేమో" యని "చంద్రాపీడునియాజ్ఞ దాఁటుట యుక్తమా? రాజదంపతులయం దైన విశ్వాసము లేదా! మీజనకులదర్శనము సేయుట నీకు ముఖ్యముగాదా" అని బహువిధముల నిష్ఠురముగాఁ బలుక నతఁడు నవ్వుచు నిట్లనియెను—

"నాకుమాత్రము తెలియదా? కారణమేమో కాని నేనీప్రదేశము విడువఁజాలకున్నాను. ప్రాణములైన విడువ నిష్టపడుదునుగాని యీప్రదేశము విడువనొల్లను. చంద్రాపీడుని సన్నిధినుండు భాగ్యము నాకు లేదు. మీ రది యనుభవింపుఁడు. మఱిమాటలాడింపక మీరు పురమునకుఁ బొండు. అని పలికి విరక్తునివలెఁ గందమూలఫలములతో శరీరయాత్ర నడపుచు నేదో ధ్యానించుచుండెను.

మేము మఱిమూఁడుదినము లందుండి విఫలప్రయత్నులమయి తిరిగివచ్చితిమి. దేవరకు సందేశ మంపుచోఁ బ్రయాణా

యాసము గలుగునని యూరకుంటిమి. ఇంకొన్ననేకదా పురము నకుఁ జేరితిరి.

చంద్రాపీడుఁ డామాటలు విని యాశ్చర్యమొంది యా కస్మికముగా నింత వైరాగ్యము నొందుటకుఁ గారణమేదియుఁ గనఁబడదు. నేనెన్నఁడును పొరపాటునవయిన నాతని నవమా నపఱుపలేదు. ఇతరులు నాయందువలెనే యాతనియందు భ యస్నేహములతో నుందురు. గృహస్థధర్మ మవలంబించి వంశస్థాపన చేయలేదు. ఇప్పుడు వైరాగ్య మేమి? వైశంపాయనుఁడు వచ్చి కాదంబరీ సమాగమమునకు సముచితోపాయము చెప్పు నని నేనెదురుగా వచ్చియుండ నాతనినే వెదుకవలసివచ్చినదే. ఈవార్త తెలిసి దుఃఖించు శుకనాసుని, మనోరమను, నాజనకు లను నోదార్పక పోవుటెట్లు? ఒకవేళ వెళ్లినను, వైశంపాయను నివలెనే చంద్రాపీడుఁడుగూడ నీవంక పెట్టి వెడలినాఁడని దుః ఖింతురు. వారితోఁ జెప్పి యొప్పించియే వైశంపాయనుని వె దుకఁబోయెదను. వైశంపాయనవియోగదుఃఖము సుఖపరిణా మముగాఁగలదు. కాదంబరియును, వైశంపాయనుఁడును స మీపముననే యున్నారుగదా. బాగుబాగు. ఇదియు మంచి కే వచ్చినది. అని యెంచి, ధైర్యమవలంబించి, పురమున కరిగి, తనతల్లిదండ్రులు పుత్రవియోగదుఃఖమొందు శుకనాసమనో రమల నోదార్ప వెళ్ళిరని విని యచటికరిగి వారలనందఱ నంగీ కరింపఁజేసి వైశంపాయనునిఁ దీసికొనివచ్చుటకుఁ బ్రయాణము

య్యెను. వారాహమూర్తికులు ప్రయాణమునకు మంచిముహూర్త ము లేదనఁగా, మనోజవమే ముఖ్యముగాని యితరములుగావు. ఆవశ్యకకార్యమునకు అత్యనిశ్చితకాలమే మంచిముహూర్త మని వారికి నచ్చఁజెప్పి బయలుదేఱెను. ప్రయాణారంభమున నిం ద్రాయుధము ప్రయాణమం దిష్టము లేనట్టు ముఖమున దైన్య ము చూపెను. వైశంపాయనదర్శనాభిలాషయుఁ గాదంబరీ దర్శనాసక్తియు మంచిచెష్టలుగాని సుశకునాపశకునములుగాని చూడనీయలేదు. ప్రయాణమయి ఎప్పుడు వైశంపాయుని జూడఁగల్గుదును. ఏక్షణమునఁ గాదంబరీదర్శనసుఖ మనుభవిం తును. కాదంబరీకరగ్రహణ మెప్పుడు సేయుదును. మదలేఖ ను వైశంపాయనునికి నెప్పుడు పెండ్లిసేయుదును. అని యత్యా తురతతో విశ్రాంతియైన లేక కొలఁదిపరివారముతోఁ బోవు చుండ మధ్యమార్గమున నధికవర్షములు గురియ మొదలు పెట్టెను. వర్షములోఁ దడియుచునే ప్రయాణముచేసి యచ్ఛో దసరస్సునకుఁ గొంచెము సమీపమునకు రాఁగా మేఘనాదుఁ డు గనఁబడెను.

అతఁడు దూరమునుండియే నమస్కరింప "మేఘ నాదా! పత్రలేఖావృత్తాంత మటుండనిమ్ము. వైశంపాయను నిఁ జూచితివా? అతఁ డొంటరిగా నచ్చటనుండుటకుఁ గారణ మడిగితివా?" యన నతఁడు "దేవా! వైశంపాయనుని కెదు రేగి యాతనితో మాటలాడివచ్చెదనని నాఁడు దేవర చెప్పుట

తప్పు నాతనినిగుఱించిన నాకేమియుఁ దెలియదు. అచ్ఛోద సరస్తీరమునకు వచ్చినట్లుగూడ వినలేదు. వర్షాకాలమగుటచేఁ బ్రయాణమువలదని జనకులు నివారింప దేవర రాఁకకు విలంబ మయ్యె ననుకొంటిమి. కేయూరకుండును పత్రలేఖయు నచ్ఛో దసరస్సు చేరకముందే నన్ను వెనుకకుఁ బొమ్మనిరి. మేమును నీవెనుకనే తిరిగివచ్చెదమనిరి.

చంద్రా—పత్రలేఖ నేఁడు తిరిగి వచ్చునా?

మేఘు—దేవా! ప్రయాణమాఁపు సేయునంతటి విఘ్న మేదియు లేనిచో వచ్చునని తోఁచుచున్నది.

అట్లువా రిరువురు మాటలాడుచు నచ్ఛోదసరస్తీరము నకు వచ్చిరి. చంద్రాపీడుఁడు నలువంకలఁ గలయఁజూచి వైశంపాయనునిజాడ యైనఁ గానక దుఃఖించి "నేను వచ్చెద" నని పత్రలేఖవలన విని సిగ్గుచే నా మొగముచూడలేక యెక్క డనో దాఁగియుండును, లేదా, వనాంతరమున కరిగియుండు ను. మహాశ్వేతనడిగినఁ దెలియవచ్చును. అని మహాశ్వేతా శ్రమమునకుఁ బోయి యింద్రాయుధము దిగి ద్వారమునఁ బరి వారముతో నిలిచియుండెను. మహాశ్వేత వారినిఁ జూచి, దుః ఖమునఁ దలవంచుకొని శిలాతలమునఁ గూర్చుండెఁ దరలిక యామెను బట్టుకొనియుండెను.

చంద్రాపీడుఁడు మహాశ్వేతావస్థ చూచి కాదంబరి కేదియో యనిష్టము సంభవించియుండునని యూహించి తర

లికను బలుకరించి యేమిది యని యడుగ నామె మహాశ్వేత ముగము వైపు చూచెను.

మహాశ్వేత గద్గదస్వరముతో నిట్లు చెప్పఁదొడఁగెను. "మహానుభావా! మొదటవచ్చినపుడు నావృత్తాంతము చెప్పి నీకు బాధగలిగించితిని. నిర్భాగ్యురాలను, దుఃఖాత్మురాలను. ఇప్పుడు మఱియొక దుఃఖవార్త తెలిపి నీకు దుఃఖముగలిగించెదను.

నాఁడు నీవుజ్జయినీపురమున కరిగినట్లు కేయూరకుని వలనవిని గుండెబ్రద్దలయి "చిత్రరథునికోరిక దీర్పలేనయితిని. కాదంబరికిఁ బ్రియసమాగమము గలిగింప నేరనయితిని. నా జన్మమెందుల" కని విరక్తినొంది యథాపూర్వముగాఁ దపస్సు చేసికొన నిక్కడకు వచ్చితిని.

ఇక్కడ బ్రాహ్మణయువకుఁ డొకఁడు నాకంటఁబడెను. ఆతఁడు సర్వవిధములను దేవరను బోలియుండెను. ఆతఁడు శూన్యహృదయుఁడై వెఱ్ఱిచూపుచూచుచు నాతో "సుందరీ! ప్రతిప్రాణియును దనస్థితికిఁ, దనయాకృతికి, దనవయస్సునకును దగినసుఖమనుభవించుట సహజము. నీవు దానికి విరుద్ధముగా రూపవయస్సులను వ్యర్థముచేసి తపస్సు చేయుచున్నావేమి? నీవంటిసౌందర్యవతికే సుఖమందుటకు శక్తిగలిగినచో నింక సుఖానుభవమునకుఁ బాత్రులెవ్వరు? " అనుచు నేమేమో చెప్పుచుండెను. నామనము పుండరీకవియోగమున విరక్తమైయుం

డుటచే వానిమాటలు వినోదమునకైనను విన బుద్ధిపుట్టదేము. దేవతార్చనకై పుష్పములు కోయఁబోవుచు తరలికతో "ఆతని హృదయ మన్యరీతినున్నట్లు తోఁచుచున్నది. మనయాశ్రమమునకు నాతని రానీయకుము. వలదని వారించినను వచ్చెనేని వానికిఁ జేరనీయకుము అని చెప్పు" మంటిని. ఎంతనిషేధించినను రాకమానఁడయ్యె. ఆతని భావమయిన మాట దయ్యెను.

కొన్ని దినములు గడచినతర్వాత వెన్నెలలో నేనొంటరిగా శిలాతలముపైఁ బరుండి చంద్రునిఁ జూచుచు చంద్రా! పుండరీకుని నీకిరణములనుండి వర్షింపరాదా! ఆదివ్యపురుషుని మాటలు సత్యదూరములగునా? నా కంతభాగ్యము పట్టునా? పుండరీకమిత్రుఁడగు కపింజలుఁడు వార్తయైనఁ జెప్పి పోఁగూడదా? అని తలపోయుచుండఁగా నా బ్రాహ్మణుఁ డున్మత్తునివలె మీఁదికి వచ్చుచుండెను. నేను భయపడి దిగ్గున లేచి "ఈతఁ డున్మాదమున నాయొడలిమీఁద జేయివేసినచో ప్రాణములు విడువవలసినదే గదా. పుండరీకుఁ డెప్పుడో వచ్చునని యాపాశప్రాణములు నిలఁబెట్టుకొని యుంటిని. అని కొంచెము దూరముగాఁ బోవ నాతఁడు "చంద్రముఖీ! శరణాగతుని రక్షింపవా? నా ప్రాణములు నీచేతిలో నున్నవి. నీదేహమిచ్చి నాదేహము రక్షింపుము. లేకున్న బ్రతుకఁజాల" నని యెను. ఆమాటలు నా చెవిసోకినంతనే కోపావేశమెత్తి ఓరి

పాపాత్ముఁడా! ఏమివాగితివిరా! ఇంక నీతల వ్రక్కలుగాదేమి రా! నీనోరు పడిపోను. సకలలోకశుభాశుభసాక్షులగుపంచభూతములును నీదేహమునలేవా? ఉన్నచో నిన్నేల తమలో నవిలయము చేసికొనలేదురా! నోటికివచ్చిన పరియరుకొంటివా? యుక్తాయుక్తజ్ఞానమక్కఱలేదా? అజ్ఞానము లేకుండఁగ నోటమాటలుమాత్రము పలుకుట శుకజాతిలక్షణము. నీవు మనుష్యజన్మ మెత్తలేదా? అని దూషించిదూషించి "పుండరీకుని జూచినది మొదలు నాహృదయము మన్యపురుషుని చింతింపకుండెనేని నాసత్యవచనమున నీవు శుకజాతి యందు జన్మించుఁగాక" అని శపించితిని. నాసత్యవచనమహిమయో, హాని యత్యుత్కటపాపఫలమో ఏదో తెలియదు గాని యాతఁడు మొదలునఱికినచెట్టువలె నేలఁగూలెను ఆతని దేహమునుండి చంద్రకాంతివంటి తేజస్సు పైకిఁబోయెను. ఆతనిప్రాణము లెగిరిపోయినతర్వాత రోదనము సేయునతని పరిజనమువలన నాతఁడు దేవరకు మిత్రుఁడని వింటిని. అని చెప్పి సిగ్గుపడి, తలవంచుకొని యూరకుండెను.

చంద్రాపీడుఁ డామాటలు వినినంతనే యాతనిహృదయము భిన్నమయ్యెను. మొదట నెట్టో మహాశ్వేతతో "భగవతి ! నీ వెంతప్రయత్నము చేసినను నాకీజన్మమువఁ గాదంబరీ పాదపద్మసేవ ప్రాప్తము లేదు. భావిజన్మమునసయిన సంఘటన చేయుము" అని చెప్పి మూర్ఛనొంది పడిపోయెను.

తరళిక మహాశ్వేతను వదలి, చంద్రాపీడుని బట్టుకొని "మహాశ్వేతా! యిూకే సిగ్గేమి? తలయెత్తి చూడుము. ఈతని మెడలు నిలఁబడుటలేదు. శ్వాసములు సరిగాఁ బ్రసరించుట లేదు. అయ్యో! అయ్యో! హా! దేవ! కాదంబరీప్రియ! మా కాదంబరిని విడిచిపోయితివా!" అని యెలుఁగెత్తి యేడువ మహాశ్వేత కొయ్యవాఱి యుండెను.

చంద్రాపీడుని పరివారము మహాశ్వేతనుద్దేశించి "ఓసి! పాపాత్మురాల! ఓసి దుష్టతాపసి! నీవేమి చేసితివే! తారాపీడునివంశ మంతరింపఁజేసితివికదే. దుర్మార్గురాల! ప్రజలందఱ ననాధలఁ జేసితివికదా! దేవా! చంద్రాపీడా! రాజకుమారా! పుత్రవత్సలుఁడగు తారాపీడుఁ డెట్లు జీవించును? మా తల్లి తన ప్రాణముల నిలుపుకొనఁగలదా. మాకు గతియేమి?" అని యేడ్చుచు మహాక్షోభ మొందుచుండెను.

అంతకుమున్నే కాదంబరి పత్రలేఖవలనఁ జంద్రాపీడుఁడు వచ్చునని వినియున్నదిగాన నాతనికి సమర్పింప మాల్యాభరణాదులు పట్టుకొని మదలేఖాపత్రలేఖలు పార్శ్వముల నడువఁ గేయూరకుఁడు ముందు త్రోవసూపఁ గాదంబరి మహాశ్వేతాశ్రమమునకు వచ్చుచుండెను. చంద్రాపీడునిఁ జూడవలయునను తీవ్రవాంఛతో వడివడిగాఁ బోయి మహాశ్వేతాశ్రమ ద్వారమునను న్న రాజపరివారమును జూచి చంద్రాపీడుఁడు వచ్చెనని సంతోషమునొంది యంతలోనే వారిదుఃఖస్థితిచూచి

యేమిటి యని వికలత నొంది దగ్గఱకుఁగ వచ్చి, పడియున్న చం
ద్రాపీడునిఁ జూచి మూర్ఛనొంది నేలపై వ్రాలెను. పత్రలేఖ
చైతన్యశూన్యయై పడిపోయెను. మదలేఖ కాదంబరిని బట్టు
కొనియుండెను. కాదంబరి దీర్ఘకాలమునకుఁ జైతన్యము నొంది
స్త్రీస్వభావవిరుద్ధముగా నిశ్చలదృష్టితో గ్రహముసోఁకినదాని
వలెఁ జంద్రాపీడునిముఖమువంక చూచుచుండెను.

మదలేఖ యామెనోదార్చ “ రాజకుమారీ ! నీహృద
య మతిసుకుమారము. చెదరనీయకుము. తెలిపి తెచ్చుకొను
ము. మీ జనకుల మొగము చూచియైన నీ ప్రాణములు కుదురు
పఱచుకొనవలెను. నీవు లేకున్న వారు బ్రతుకఁగలరా !
అనెను.

కాదంబరి వింతచెంది వెడనవ్వునవ్వి “ వెఱ్ఱిదానా ! నా
హృదయము సుకుమారమా ? వజ్రముకంటెఁ గఠినతరము.
పగులదు. భయములేదు. బ్రతికియుండఁదలఁచినదానికిగదా
తల్లిదండ్రుల మొగము చూచుట. చాలఁబోవు దాని కవియన్ని
యు నేల ? ఎట్లో ప్రియుని పాదారవిందములు పొందఁగలిగితిని.
చాలును. బ్రతికియుండిన నిహలోకసుఖము. చచ్చిన చో సహ
గమనమునఁ బరలోకసుఖము. నాకేవిధముగుదుఃఖమును లేదు.
నానిమిత్తము వచ్చుచుఁ బ్రాణములువిడిచిన నాథుని నేను విడి
చెదనా ? ఆతనిపాదధూళి ననుసరించి పోఁగలిగినభాగ్యము
సంభవించినందులకు సంతసించుచున్నాను.

ఎవ్వనినపేక్షించి కులాచారముపేక్షించితినో, ఎవ్వని దరిఁ జేరి పితృవాక్యముల్లంఘించితినో, ఎవ్వనివరియించి మహాశ్వేతావిషయమునఁ జేసిన ప్రతిజ్ఞ వీడితినో అట్టి ప్రాణేశ్వరుఁడు అట్టి సుందరాకారుఁడు అట్టి సుగుణసంపన్నుఁడు నా నిమిత్తమయి వచ్చి ప్రాణములు విడువఁగా నేను ప్రాణములతో నుందునా? అట్టి లజ్జాకరమగు జీవన మేల? నాపైని నీకు స్నేహ మున్న యెడల నానిమిత్తమున నాతల్లిదండ్రులు మృతి నొందకుండఁగఁ జేయుము. నాసఖీజనము, నాపరివారము, నా శుకశారికాదిపక్షివర్గమును ఏలోపమును లేకుండఁగ నేనున్నపుడువలెనే సుఖముగానుండునట్లు చూడుము. నావీణ నీవు పుచ్చుకొనుము. నాద్రవ్యమంతయు నీయధీనము చేసితిని. నీకుఁ గావలసినది కైకొనుము. మిగిలినది సద్వినియోగము చేయుము. నేను చితిలోఁ బడి ప్రియునితోఁ గలసి సుఖముగా నుందును." అని చెప్పి మహాశ్వేతను గౌఁగిలించికొని "సఖీ! నీకుఁ ప్రత్యాశ గలదు. పునస్సమాగమాశ యెన్నిదుఃఖములనయిన సహింపఁ జేయును. నాకట్టియాశ లేశమయినను లేదు. జన్మాంతరమున నీసహవాసముగలుగఁ గోరికొనుచున్నాను. అని చెప్పి తొందరగాఁ బ్రియునిపాదములకు నమస్కరించి తన తొడపైఁ బెట్టుకొని శరీరమంతయు స్పృశింప, నపు డాతని దేహమునుండి యేదియో యవ్యక్తతేజము వెడలిపోయెను. అంత నామె యింతయుఁ జూచుచుండ నాకాశవాణి యిట్లు వినఁబడెను.

“వత్సా! మహాశ్వేతా! మరల నొకమాటు నిన్నోదార్చి బోధింపవలసియున్నది. పుండరీకశరీరము నాశరహితమయి యాలోకమున నున్నది. నీకుఁ బునస్సమాగమము లభించును. చంద్రాపీడశరీరమును నాస్వరూపమే. ఇది స్వతస్సిద్ధముగా నాశనము లేనిదే. అందును కాదంబరీకరస్పర్శమున సుస్థితినొందినది. కాని శాపవశమున, పరకాయప్రవేశము చేసిన యోగీశ్వరుని దేహమువలెఁ గొంతకాలము జీవాత్మశూన్యమయి యుండును. దీని కగ్నిసంస్కారముగాని జలప్రక్షేపముగాని ఖననముగాని చేయరాదు. జీవాత్మ తిరిగి దేహమునఁ బ్రవేశించుదాఁక భద్రముగా నుంచి కాపాడవలయును. ముమ్మాటికి నామాట నమ్ము.”

ఆమాటలు విని యందఱును పరస్పరము చూచుకొని యాకసమువంకఁ జూచుచుండిరి. పత్రలేఖమాత్రము లేచి యింద్రాయుధాశ్వమును విప్పి చంద్రాపీడుఁడు వెడలిపోయిన తర్వాత నీ బ్రతుకును, నా బ్రతుకును ఏల? అనుచు నచ్ఛోదసరస్సునకుఁ దీసికొనిపోయెను. పత్రలేఖయు, నింద్రాయుధమునందు దుమికి మునిఁగినవెంటనే యాసరస్సునుండి జటాయజ్ఞసూత్రాదిచిహ్నములతో మునికుమారుఁ డొకఁడు పయికి వచ్చెను.

అతఁడు మహాశ్వేతయెదుట నిలఁబడి జన్మాంతరము నొందిన నన్ను గుర్తుపట్టితివా యని నామె దుఃఖమధ్యమునను

న్నను తొందరతో లేచి నమస్కరించి "కపింజలా! ఈపాపాత్మురాలిమీఁద నేఁటికిదయవచ్చినదా! పుండరీకుఁడు లోకాంతరగతుఁడయినను పాడుప్రాణముల నిలఁబెట్టికొనియున్నకతన రాలను. నాపై దయయేల? పుండరీకునిఁ దీసికొనిపోయినయాతఁ డెవఁడు? ఎక్కడకుఁ గొనిపోయెను? ఆతనివిడిచి నీవేల వచ్చితివి. అని యడుగ నతఁ డిట్లు చెప్పెను—

"గంధర్వరాజపుత్రీ! వాఁడు పుండరీకునిదీసికొనిపోవు వానివెంట నేనును వెళ్లితిని. ఆతఁడు నామాటలకు బ్రత్యుత్తర మీయకయే పుండరీకుని చంద్రలోకమునకుఁ దీసికొనిపోయి యచ్చటఁ జంద్రకాంతపర్యంకమునఁ బరుండఁబెట్టి వెంటఁబోవు నన్నుఁ బలుకరించి యిట్లు చెప్పెను.

"నేను చంద్రుఁడను. విధియేర్పఱిచినరీతిని జగదుపయోగార్థ ముదయమయినతఱిఁ గామపరవశుఁడయి యాత్మాపరాధమున శరీరత్యాగము చేయునిమిత్తుఁడు నిరపరాధినగు నన్నునుద్దేశించి "ఓరీ క్రూరాత్మా! దయావిహీనా! చంద్రా! అనురాగోదయమయినతర్వాతఁ బ్రియాసమాగమసుఖము లభింపకుండఁగనే నన్ను నిర్దయుఁడవయి చంపుచున్నావు. కావున నీవును భరతవర్షమున జన్మజన్మమునను బ్రాప్తానురాగుఁడవయి ప్రియాసమాగమము పొందకయే మృతినొందుదువు గాత" మని శపించెను. తనదోషముఁ గనక దోషరహితుఁడ నగునన్ను శపించినందులకుఁ గోపమునొంది "నీవును నాతో

సమముగా సుఖదుఃఖము లనుభవింతువుగాత నని ప్రతిశాప
మిచ్చితిని. కొంతసేపటికిఁ గోపముకొంచెము చల్లార, వివేక
ముతో విచారించి యీతనికిమహాశ్వేతయెడఁ గలిగిననతివ్యస
నమును ఆమెకీతనియందుఁ గలప్రేమమును గనిపట్టితిని. స్వ
యంకృతాపరాధమునచే నాతోఁగూడ నీతఁడు రెండుజన్మము
లెత్తవలసియున్నది. జన్మజన్మమునను అని నాకు శాపమిచ్చి
నపుడనుటచే రెండుజన్మము లెత్తికతీఱదయ్యె. అంతవఱకు ని
తనిదేహమును నేను రక్షింపఁదెచ్చితిని. మహాశ్వేతను దేహ
త్యాగముచేయవలదని యుపదేశించితిని. నీవితని తండ్రియగు
శ్వేతకేతువున కీవార్త తెలుపుము. అతఁడు మహాతపశ్శాలి.
ఏదేని ప్రతిక్రియ చేసినను జేయువచ్చును.

అని చెప్పి నన్నుఁబంప మిత్రవియోగదుఃఖమున శూ
న్యహృదయుఁడ నయి యాకసమునఁ బరుగెత్తికొనిపోవుచు
నొకవైమానికునిమీఁదనుండి దాఁటితిని. అతఁడు సహజము
గాఁ గోపిష్ఠుఁడు. కన్నులెఱ్ఱసేసి యోరీ! దురాత్మా! తపో
బలగర్వమున గుఱ్ఱము దాఁటినట్లు నావిమానముమీఁదనుండి
దాఁటితివిగాన గుఱ్ఱమవై పుట్టు మనిశపించెను.

శాపభీతుఁడనయి "మహాత్మా! మిత్రవిరహశోకాం
ధుఁడనయి దాఁటితినిగాని తపోబలగర్వమునఁగాదు. శాప
ముపసంహరింపుమని యెన్నివిధములనో ప్రార్థించితిని. అతఁడు
కనికరమునొందియుఁ దనశాప మమోఘముగుటచే నుపసంహ

రింపవీలు లేదనియెను. నేను దైన్యముతో "మహానుభావా! నామిత్రుఁడగు చంద్రాపీడుఁ డొకశాపదోషమున భూలోకమందు జన్మింపవలసియున్నది. అతఁ డెక్కడనుండునో దివ్యదృష్టితో గ్రహించి నే నాతనికి వాహనమ నయి పుట్టునట్లు లనుగ్రహింపుమన నతఁడు దివ్యదృష్టితోఁ జూచి యిట్లు చెప్పెను.

చంద్రుఁడు తారాపీడునకుఁ గుమారుఁడై జన్మించును. పుండరీకుఁడు తారాపీడుని మంత్రియగు శుకనాసునకుఁ బుత్త్రుఁడగును. నీవా రాజకుమారునకి వాహనమవు గమ్ము. అని చెప్పి యాతఁడు పోవ నేనప్పటినుండియే సముద్రమున నుఱికితిని. నాకశ్వజన్మము లభించెను. క్రమముగాఁ దారాపీడునకుఁ గానుకగాఁ బంపఁబడి చంద్రాపీడునకి వాహనమ నైతిని. గంధర్వమిథునమును వెంటాడించు నెపమున రాజకుమారుని నిచ్చటకుఁ దీసికొనివచ్చితిని. పుండరీకాపరావతారమగు వైశంపాయనుఁడుగూడ నిక్కడకువచ్చి పూర్వజన్మసంస్కారవశమున నీయం దనురక్తుఁ డయ్యెను."

మహాశ్వేత కపింజలునిమాటలు విని పుండరీకునుద్దేశించి "పుండరీకా! ప్రాణేశ్వరా! జన్మాంతరమునఁగూడ నాయందనురక్తిగలిగి నాయొద్దకు స్వయముగా వచ్చిననిన్ను రాక్షసినై చంపితిఁగదా! ఈపాపబుద్ధికిఁ బ్రతికినందులకు ఫలిత మిది యేకాఁబోలు. హా నాథా! నాథా!" యని నేలపైఁబడి యేడ్వసాగెను.

కపింజలుఁ డామెతో నిట్లనెను "గంధర్వరాజపుత్రీ! నీతప్పేమియున్నది. నిన్నేల నిష్కారణముగా నిందించుకొనెదవు? నీయాత్మ నేలహింసపెట్టుకొనెదవు. మాకు యాథార్థ్యము దెలియకున్నచో అనిష్టము సంభవించునని చెప్పితిని. మీరలు విన్నయాకాశవాణి చంద్రునివాణియే. తపస్సు నవలంబింపుఁడు. తపస్సునకు సాధ్యముగానిది లేదుగదా. పార్వతి తపమున నేకదా యీశ్వరునర్ధదేహము పొందఁగలిగినది. మీరును బ్రియులఁ బొందఁగలరు. సంశయము నొందకుఁడు."

ఆమాటలువిని మహాశ్వేత కొంచె మూరడిల్లెను. కాదంబరి దీనవదనయయి "కపింజలా! అశ్వజన్మమెత్తిననీవును పత్రలేఖయు నొక్కమాఱె సరస్సునఁ బ్రవేశించితిరిగదా. ఆమె యేమయ్యె ననియడుగ, "కాదంబరీ! పత్రలేఖ యేమయ్యెనో నేనెఱుఁగను. తద్వృత్తాంతమును చంద్రాపీడునియాత్మ యెందున్నదియు, పుండరీకాపరావతారమగు వైశంపాయనుఁ డెచట జన్మించినదియుఁ దెలిసికొన శ్వేతకేతువు దర్శనమునకుఁ బోయెదను. ఆమహాతపశ్శాలి కాలత్రయమునందును లోకత్రయమున జరుగువృత్తాంతమును దివ్యదృష్టితో గ్రహించి చెప్పఁగలఁడు. అని చెప్పి యంతర్ధానమయ్యె. శోకరసమును మించి యద్భుతరసము వారిహృదయముల నాక్రమించెను. చంద్రాపీడపరివారజనమంతయు శోకాద్భుతరసములలో మునిఁగి వినుచుండెను. కాదంబరి మహాశ్వేతను బలుకరించి "సఖీ! ము

న్నునీవరణ్యమున దుఃఖము నొందుచుండఁగా నేనింటసుఖముగా నుండి నిన్ను సఖి యని పిలుచుటకు సిగ్గుపడుచుంటిని. ఇప్పుడు సమానదుఃఖమున నున్నారముగాన నిస్సందేహముగా సఖి యని పిలిచెదను. నాకుఁ గర్తవ్యమేమో నీవుపదేశింపుము ” అన మహాశ్వేత “ ప్రియసఖీ! ఒకరు చెప్పుట కేమున్నది? ప్రియసమాగమాశయే చేయవలసినదంతయు నుపదేశించును. పుండరీకవృత్తాంతము కపింజలుఁడు స్పష్టముగాఁ జెప్పెను. అదియే నమ్మియుందును. నీకుఁ బ్రత్యక్షముగాఁ బ్రియునిశరీరమే యున్నది. ప్రత్యక్షదైవతముగుచంద్రుని యవతారమూర్తి యిది. అప్రత్యక్షముగుదేవతలకు మృద్దారుశిలాదులతో రూపములు కల్పించి పూజించి సిద్ధినొందుట వినుదుము. ప్రత్యక్షదేవతాశరీరమునకుఁ బరిచర్య చేసిన నభీష్టము సిద్ధించు ననుటలో సందేహమేమి? యని చెప్పె.

అంతఁ గాదంబరి తరలికా మదలేఖలసాహాయ్యమునఁ జంద్రాపీడశరీరమును శీతవాతాతపబాధ లేనిప్రదేశమునఁ బరుండఁబెట్టి మరణముకంటెను గష్టతరమగునవస్థ యనుభవించుచు నాతనిచరణకమలములు తనయంకతలమున నుంచి పూజించుచు నాఁడు నిరాహారయై యుండెను.

చంద్రాపీడపరివారము మిగుల డస్సి యాఁకలిగొని యున్నను మహాదుఃఖమున నాహారశూన్యమయి యుండెను. మఱునాఁటిసూర్యోదయమునఁ జిత్రరథుపవలెఁ జలింపకున్నను చె

క్కు చెదరక, కాంతివిహీనముగాక శోభిల్లు నాతనిశరీరము కాదంబరి మదలేఖకుఁ జూపి " కాంతివశముననో, నిజముగా వికారము గలుగకుండుటనో సజీవముగానున్నట్లే కనఁబడుచున్నది. పరిశీలింపు " మన మదలేఖ పరిశీలించుట కేమున్నది. ఆకాశవాణియుఁ గపింజలవాక్యములు సత్యంకారములగునా? ఆతని యాత్మ శాపవశమున నెచ్చటికో పోయినను పరకాయప్రవేశము చేసిన యోగిశరీరమువలె నిర్వికారము యుండును. ఆత్మ మరలవచ్చి యందుఁ బ్రవేశించుదాఁకఁ బరిచర్య చేయుము. " అని చెప్పి రాజపుత్త్రి తత్పరిచారకునకు నతని దేహస్థితి చూపు నెల్లరు గొంతయాశ నొంది సంతసించిరి.

కాదంబరియు నాత్మశరీరధారణార్థము ఫలాహారము గ్రహించి చంద్రాపీడశరీరమునకుఁ బరిచర్య చేయుచు నొకనాఁటికంటె నొకనాఁడు జీవకళ హెచ్చుచుండుట చూచి మదలేఖను బిలిచి " సఖీ! నిస్సందేహముగా జంద్రాపీడుని యాత్మ యీశరీరమున మరలఁ బ్రవేశించును. అక్కడకు నీవుపోయి నా జనకులకు విశ్వాసముగ నిట్లు చెప్పిరమ్ము. వారిచ్ఛకొదువ రాకుండఁగఁ జేయుము. వారు వచ్చినచో నేను దుఃఖమును నాఁపుకొనఁజాలను. నాప్రియుఁడు మృతినొందెనని యనుకొనినపుడే నేను కంటనీరు రానీయలేను. పునరుజ్జీవితుఁడగునని నమ్మిక గలిగినపుడేల కంటనీరు రానీయవలెను. అప్పుడు దుఃఖకాలమునఁ గనఁబడినచో దుఃఖముప్పొంగును. అని చెప్పి

యూరామె నంప నామె వెళ్లి తిరిగివచ్చి కాదంబరితో “సఖీ! అట్లు చెప్పినప్పటికిని హారుకూఁతను భర్తృసహితముగాను నన్నుపును చూచుటయే తనకిష్టమనెను. మఱియు నీవు స్వయముగా వరించితివి. అతఁడు చంద్రాపీడావతారమూర్తి యింతకంటె మాకుఁ గావలసిన దేమున్న దని రని చెప్పెను.

౭

అంతఁ గొంతకాలము గడవఁగా, చంద్రాపీడుని వార్త తెలిసికొనఁ దారాపీడుఁడు పంపిన వార్తావహులు వచ్చిరనియు, వారితోఁ జంద్రాపీడుఁడు ప్రస్థానము దర్శనమిచ్చుటకుఁగాని సందేశపు పులకుఁగాని వీలు లేదనియు నెట్టి విధములఁ దాను చెప్పినను చంద్రాపీడుని పాదారవిందములఁ జూడక పోఁజాలమని పట్టుపట్టుచున్నారనియు మేఘనాదుఁడు కాదంబరితోఁ జెప్పె నామె వారిపట్టు న్యాయమే. వారిమార్గాయాసమును, నేత్రములను సఫలము చేసికొనెదరుగాక.” అని మేఘనాదుఁడు వారినందఱను దీసికొనివచ్చెను.

వారు చంద్రాపీడుని స్థితి చూచి దుఃఖింపఁగా, కాదంబరి స్వయముగా వారినిఁ బలుకరించి ప్రకృతిస్థితిని బట్టి దుఃఖము దగునా. మేఘనాదుఁడు జరిగినదంతయుఁ జెప్పెనుగదా. సుఖాంతమగు దుఃఖము దుఃఖముగాదు. ప్రత్యక్షముగా నీతని

శరీరము మాడుడు. నిర్జీవమగుశరీర మెక్కడనయిన నింతకా
లము నాశరహితముగ యుండునా? మూఢనివా రిది విశ్వ
సింప నవకాశము లేదు. మీ రీవార్త మీప్రభుదంపతులకుఁ
దెలిపితిరేని వారిహృదయము భిన్నమయినఁ గావచ్చును. రాజ
కుమారమిత్రుఁడను ప్రత్యక్షముగా వృత్తాంతమంతయుఁ
జూచినవాఁడును వాక్చాతుర్యముగలవాఁడును నగువాని నొ
కని మీలో మేఘనాదుఁడు పంపుడు. అతఁడే యీవృత్తాం
తము తారాపీడునకుఁ దెలుపును. మీరు చెప్పకుఁడు. అని
మేఘనాదునివలన అట్టివాఁడు త్వరితకుఁ డని తెలిసికొని యా
తని వారివెంటఁ బంప మేఘనాదుని కాజ్ఞయిచ్చెను. పారం
దలును బయలుదేఱి వెళ్ళిరి.

అట చంద్రాపీడునిజనని పుత్రునివార్త తెలియక పరి
తపించుచు, పురమునకు దూరముగానున్న యవంతీమాతృకల
యాలయమున కరిగి పుత్రునకు క్షేమము గలుగఁ జేయ నాదే
వతలఁ బూజించుచున్నగతి వార్తావహులు త్వరితమనస్సుతోఁ
దిరిగిపోవు మార్గమధ్యమున విలాసవతీదేవి యచ్చట నున్న
దని విని యచటి కరిగిరి.

మొదట నామె సంతోషముతో వారిని జూచెనుగాని
వారిదీనవదనములు చూచి మనమున సంశయము నొంది చిరం
జీవివార్త తెలుపరేమి? ప్రతిసందేశ మేది? మీరు వత్సను
చూచితిరా? లేదా? అని యాతురతతో నడుగ వా రివళ

ముగా వచ్చుదుఃఖము నాఁపుకొని అమ్మా! అచ్ఛోదసరస్తీర మునఁ జూచితిమి. జరిగినవృత్తాంత మంతయుఁ ద్వారకుఁడు చెప్పు నని యూరకుండిరి.

ఆమె వారిముఖరీతి చూచి పుత్రునకు కష్ట మేదియో జరిగియుండు నని తలఁచి అయ్యో! మీముఖములే చెప్పు చున్నవి. అతఁడు చెప్పవలసిన దేమున్నది. అది హా! వత్సా! జగదేకచంద్రా! చంద్రాపీడా! విలంబము చేయక వైశంపాయనుని వెంటఁబెట్టుకొని వచ్చెదనంటివే? ఇంతమోసము చేసితివా? ఎట్టిపాపపుమాట చెవులఁ బడునో యను భయమున నాహృదయము త్వరితకు నడుగ నొల్లకున్నది. ఇంక నడుగుట కేమున్నది పుత్రా! యని మూర్ఛనొందెను.

ఆవార్త విని రాజును మంత్రియును అవంతీమాతృకాలయమునకు వెళ్ళిరి. రాజు విలాసవతిని స్పృశించి “దేవీ! వత్సవిషయమున నన్యరీతిగా జరిగియుండు నేని మనము జీవింపము. అజ్ఞానులవలె నింతదుఃఖ మొందనేల? వచ్చిన దేమి కలిసివచ్చును. విధిని దప్పిప నెవరితరము? పుత్రోత్సవముఁ జూచితిమి. పెరిగి, పెద్దవాఁడయి విద్యాబుద్ధులు నేర్చి, యువరాజపట్టము నొంది, దిగ్విజయము చేసి వచ్చుట చూచి సంతసించితిమి. ఇంకఁ గోడలితోఁ గాపురము చేయుచుండఁగాఁ జూచి సంతసించి రాజ్యభారము వానిపై నుంచి తపోవనమునకుఁ బోవఁదలఁచితిమి. అది ప్రాప్తము లేమిగాఁ బోలు.

ఇంతకును త్వరితకునివలన వృత్తాంతమంతయు విని మనకు చావో బ్రతుకో నిర్ణయించుకొనెదము. అని త్వరితకు నడుగ నాతఁడు జరిగినదంతయు చెప్పగ, వైశంపాయనునిమరణవృత్తాంతము వినఁ జంద్రాపీడునిహృదయము భిన్నమయ్యె ననువార్త దెలుప, రాజు త్వరితకా! చాలుఁజాలు. చెప్పవలసినది చెప్పితివి. వినవలసినదివింటిని. అని హా! వత్సా! వైశంపాయనునివార్త వినిన నీహృదయము భిన్నమయ్యెను నీహృదయము భిన్నమయ్యె ననివిన్నను మాహృదయము భిన్నముకాదయ్యెను. మాగుండె వజ్రతుల్యము అయినను మేము నిన్నుఁ గలసికొనెదము. అని శుకనాసా! యింకను జూచెదవేమి. చితిపేర్పించి యగ్ని యంటింపుము. ప్రజలారా! రాజ్యమరాజకమయి చెడకుండఁగఁ దగినయేర్పాట్లు చేసికొని పాలించుకొనుఁడు. వత్సా! కథామాత్రశేషుఁడ వయితివా అని యెలుగెత్తి హా! వత్సా! వత్సా! యని యేడ్చెను. త్వరితకుఁడు తొందరతో' దేవా! రాజకుమారునిహృదయము భిన్నమయినను అతనిశరీరము చెక్కుచెదరక జీవసహితమయి యున్నట్లున్నది. శాపవశమున నిది సంభవించినది. వృత్తాంతమంతయుఁ జత్తగిపు అని తర్వాతివృత్తాంతము దెలుప నాశ్చర్యమగ్నుఁడయి శుకనాసా! యిట్టియాశ్చర్యములుండునా? ఇది విశ్వసనీయమా అన నతఁడు తాను దుఃఖమగ్నుఁడయ్యును రాజముఖము నుపశమిల్లఁజేయ నిట్లనియెను.

ఖశ్రివణమునఁ జంద్రాపీడునిహృదయము భిన్నమయిన దను వాలుటెప్ప వేఱొకటి నాహృదయమున కెక్కదు నాకే మ ట్లుండ దేవిమాట చెప్పవలయునా? అక్కడకుఁబోయి కుమా రునిశరీరము చూచిననే నాప్రాణములు నిలుచును. అన విలాసవతి దుఃఖముచే సిగ్గువిడిచి ‹‹ఆర్యపుత్రా! ఆలస్య మేల? వత్సుని జూతునను వాశచేతనే నాప్రాణములు నిలిచి యున్నవి. అన రాజు శుకనాసునితోఁ గొలఁదిపరివారముతో విలాసవతీమనోరమలును మనమును బోవుదము సన్నాహము చేయుమనెను.

తారాపీడునందలి భక్తిచేతను చంద్రాపీడునియందలి స్నేహముచేతను బురజను లనేకులు బయలుదేఱి వారి ననుగ మించిరి. కొలఁదిదినములలోనె యచ్ఛోదసరస్తీరము చేరి చం ద్రాపీడుని శరీరము నాశరహితమయియున్నదని తెలిసికొని మేఘనాదునివలన వృత్తాంతమంతయు నారల విని, ధైర్య మ వలంబించి మహాశ్వేతాశ్రమమునకుఁ బోయిరి. వారు వచ్చు చున్నారని మహాశ్వేత వారిమొగములు చూడలేక గుహాలో నికిఁ బోయెను. కాదంబరి ‹‹హా దైవమా! యిప్పుడేనా, యత్తమామల ప్రథమదర్శన మని యనుకొనుచు మూర్ఛ నొందెను.

తారాపీడశుకనాసులును, విలాసవతీ మనోరమలును చంద్రాపీడునిదేహము చూచి పొంగిపొంగివచ్చు దుఃఖమును

కష్టమున నాఁపుకొని « సహజకాంతి తఱుఁగలేదు. జీవితము తప్పక వచ్చు » నని యనుచుండిరి. విలాసవతి తుదను దుఃఖమాఁపుకొనలేక « హా! పుత్రా! వత్సా! కదలక మెదలక యుంటివేమి. నాతోఁ బలుకవా? మాయందు భక్తి యేమయ్యె? నీకిట్లుండుట సుఖమా? కానీ » అని కౌఁగిలించుకొని ముద్దుపెట్టుకొని పలువిధముల నాక్రోశించుచుండ, రాజు « దేవీ! యీతఁడు దేవతామూర్తి. మనయదృష్టవశమునఁ బుత్రుఁడయ్యెను. ఇట్టి మహాత్ముని దుఃఖపడరాదు. మనము పుణ్యశరీరమునయినఁ జూడఁగలిగితిమి. మనోరమా శుకనాసుల కెంతదుఃఖము గలుగునో, వారినోదార్పవలయును. అదిగాక ఆగంధర్వరాజపుత్రి నీకోడలు. ఆమెప్రభావముననే మనవత్సుఁడు పునరుజ్జీవితుఁడు గావలెను. ఆమె మూర్ఛనొందినది ఆమెను మూర్ఛనుండి తేర్పుము. అని బోధింప నామె లేచి కాదంబరితో « తల్లీ! నీవమృతస్వరూపురాలవు. కావుననే మాచంద్రాపీడునిశరీరము చెక్కుచెదరక యున్నది. అనఁ జంద్రాపీడశబ్దశ్రవణముననే కాదంబరి మూర్ఛనుండి తేఱెను విలాసవతిహస్తస్పర్శనమున బాగుగాఁ దెలివినొంది యత్తమామలకు నమస్కారము చేయ వారు « సౌభాగ్యవతీభవ » అని యాశీర్వచనములు చేసిరి.

రాజు మదలేఖతో « మాకుఁ బుత్రదర్శనసుఖము లభించినది మేము కేవలము చూచువారమే. మీ చెలియే యథాపూర్వముగా నుపచారములు చేసి మావత్సుని పునర్జీవి

తునిఁ జేయవలయును. సిగ్గుపడి నూరినచో నపాయము వాటిల్లును. మేమెక్కడనున్న నేమి ప్రయోజనము? ఏచెల్లెలికి ధనైన నుందుము అని వెళ్లి యాశ్రమసమీపముననే తనపరివారముతో నివసించెను.

రాజు తనతో వచ్చిన రాజవర్గమును బిలిచి మీరు పురమునకుఁ బొండు. చంద్రాపీడునకు వివాహము చేసి, రాజ్యమప్పగించి, వానప్రస్థాశ్రమము గొందు నని మునుపే చెప్పియుంటిని ఈవిధముగాఁ దపోవనమునకు రావలసినవిధి యున్నది. వచ్చినమే పురమునకు వచ్చెను. అంతదాఁక మీరు రాజ్యమును న్యాయముగాఁ బాలించుకొనుఁడు. అని చెప్పి వారలఁ బంపి తపస్సు చేయుచుండెను.

కాదంబరి యథాపూర్వముగాఁ జంద్రాపీడశరీరమున కుపచారములు చేయుచు నానాఁటికి జీవాశయు, గాంతియు హెచ్చగుచుండుట దృష్టముగ నాశతో నుండెను.

౨

అని జాబాలి హారీతాదులకుఁ జెప్పి « శ్రావకులారా! కథారసము మనల నెంతదూరము లాగికొనిపోయినదో చూచితిరా. ఈశుక మెవరో తెలిసినదా? కామవశుఁడయి స్వాపరాధమువలన దివ్యలోకము విడిచి, మనుష్యలోకమున శుకనాసునకుఁ బుత్రుఁడై జన్మించిన వైశంపాయనుఁడే. తాను మును

16

శ్వేతను జూచి మోహ మొంది స్కంధావారమునకుఁ బురము నకుఁ బోవక తండ్రికి దుఃఖము గలిగించు నాతఁడు తీవ్రతపస్సు చేసెను, మహాశ్వేత పెట్టిన శాపమునను శుకజన్మ మొందెను అని జాబాలి చెప్పెను. అంత నిద్రనుండి మేలుకొనినట్లు దాని వానికి తానుక నేర్చినవిద్యలు స్ఫురించినట్లు నాకు సర్వవిద్యలు జిహ్వాగ్రమున నుండెను. స్పష్టోచ్చారణశక్తియు, సమస్తవస్తు స్మరణశక్తియుఁ గలిగెను. చంద్రాపీడునిపయి స్నేహమును, మహాశ్వేతపై ననురాగమును యథాపూర్వముగాఁ గలిగెను. కాని జనకుని వృత్తాంత మేమియో తారాపీడవిలాసవతీ చంద్రాపీడు లేమయిరో. పూర్వమిత్రుఁ డగు కపింజలుఁ డెచ్చటికిఁ బోయెనో మహాశ్వేతావృత్తాంత మేమో యాతనియు నాకుఁ దెలియుటలేదు. అని తెలిసికొన వేడుక గలిగి జాబాలితో “మహాత్మా! నీదయవలన సర్వవిధజ్ఞానమును గలిగినది కాని పూర్వబంధువులవృత్తాంతము తెలియలేదు. వారిని దలఁచికొని దలఁచికొని హృదయము భిన్నమగుచున్నది. నామరణవార్త వినఁగానే హృదయము భిన్నమైన చంద్రాపీడునివృత్తాంతము తెలిసికొనకుండ నుండఁజాలను. తిర్యగ్జాతిలో జన్మించినను చంద్రాపీడుసన్నిధి నున్నచో నాకది కష్టమని తోఁచదు. దివ్యదృష్టితోఁ జూచి వారివృత్తాంతము దెలుపుమని దీనతతోఁ బ్రార్థింప నాతఁడు స్నేహకోపములు చూపుచు, “ఓరి దురాత్మా! ఇప్పుడే యింత చపలతయా? ఇంకను తె

క్కలుగా లేదే? ఎనుకటకుఁ దగినశక్తి వచ్చినపుడు వచ్చియుండు టము చెప్పెద నని నుండలించెను.

ఆమాటలు హారీతుఁడు విని "తండ్రీ! మునిజాతిలోఁ బుట్టిన వాని కింత చాపల్య మేల? ఇంత యల్పాయుష్య మేల?" అని యడుగ నతఁడు, "కుమారా! కారణము స్పష్టముగఁ గనఁబడుచునే యున్నది. సాధారణముగా ధైర్యస్థైర్యాదులు పురుషలక్షణములు భోగలంపటతయుఁ జాపల్యమును స్త్రీలక్షణములు, జననీజనకులలో నెవరిసంకల్పశక్తి యెక్కువగనో సంతతికి వారిగుణము లబ్బును. ఇది యాయుర్వేదాదినిర్ణీతము గుటయే గాదు లోకానుభవసిద్ధము. భోగిలోలున కాయుష్య మల్పమగుట సహజమే కదా దానికి శాపముకూడఁ దోడయినది. శాపావసానానంతర మత్యాయుష్యము గలుగును," అని చెప్పెను. ఆమాటలు నేను విని జాబాలితో "మహాత్మా! పాపాత్ముఁడను. కృతజ్ఞన్మ మొందియు నీయనుగ్రహమున జ్ఞానము పడయఁగలిగితిని. ఆయుర్వృద్ధికరమగు కర్మమేదేని యుపదేశింపుము. ఆచరించెదను." అన నతఁడు "క్రమముగా నీకే తెలియును. తెల్లవాఱవచ్చినది స్నానాదికృత్యములకుఁ బోవలె నని గోష్ఠి విడిచిపోయెను. మునికుమారుఁడు పర్ణశాలలో నన్నొకయనుఁగుమీఁదనుంచి నిత్యకృత్యములు దీర్ప నరిగెను.

నాకంతకును నెక్కుడుదుఃఖము లేమిగాని యప్పడంతయు దుఃఖమునకుమే యయ్యెను. ఉచ్ఛదశ్యము మిత్రులను

గలిసికొనవలెను. ఈతనువు త్యజించుట యుత్తమము. దానికి సాధనమేమి యని యాలోచించుచుండఁ గపింజలుఁడు నన్నుఁ జూడవచ్చెనని సారికుఁడు చెప్పెను. అంతలోఁ గపింజలుఁడు వచ్చి, మనము రెండు జన్మములకు దగు మిత్రులము. గుర్తుపట్టితివా ? అని నన్ను స్పృశించి నిమిరి కంటఁదడి పెట్టుచుండ " మిత్రమా ! నీకు దుఃఖమేల సంసారానుబంధము లేని సుఖివి నీవు. రాగాంధుఁడనయిన నాకు దుఃఖ మర్హము. " అని పలికి " జనకులకుఁ గుశలమా ! నన్నెపుడయిన స్మరించిరా ? " అని యడుగ నతఁడు " మిత్రమా ! కుశలమే మనవృత్తాంతమంతయు దివ్యదృష్టిచే గ్రహించి తగినప్రతిక్రియలు చేయుచునే యున్నారు. కావుననే నాకశ్వజన్మము శీఘ్రముగాఁ దప్పినది. అశ్వజన్మము తప్పినతర్వాత భయపడుచు దగ్గఱమునకుఁ బోయిన నన్ను భగవజ్జనకుఁడు నాకభయ మిచ్చి " యిది నాతప్పే. వత్స పుట్టినపుడే యీదోషములు నాకు గోచరము లయినవి. దానికిఁ బరిహారములు చేయనయితిని. ఇప్పు డాయుర్వృద్ధికరమగు కర్మ మాచరించుచున్నాను. లక్ష్మియును తత్కర్మమునఁ దోడ్పడుచున్నది. నీవు నిశ్చింతగనే యుండు మని నేను తనయముతో " నామిత్రుఁ డెక్కడ నుండెనో దివ్యదృష్టితోఁ జూచి చెప్పు " మన నతఁడు. " నీమిత్రుఁడు శుకజన్మ మెత్తియున్నాఁడు. నీపతిని జూచినను నీవాతనిఁ గుర్తింపఁ జాలవు." అనెను. కొంతకాలము జరిగినది. నేఁటిప్రాతఃకాలమున వచ్చి

"వత్సా! నీమిత్రుఁడు జాబాలియాశ్రమమునకుఁ జేరెను. వానికి మునియనుగ్రహమునఁ బూర్వజన్మజ్ఞానము గలిగినది. నిప్పుడు గురుపట్టఁగలఁడు. నేను సంకల్పించిన యాయుర్వృద్ధికరకర్మము పూర్తియగునాఁటికి జాబాలియాశ్రమమును విడువ వలదని చెప్పుము. ఆతనితల్లి లక్ష్మియు నిచ్చటనేయుండి మా క్రియయందు సాహాయ్యము చేయుచున్నదని చెప్పి మా యాశీర్వచనములును వానికిఁ దెలుపుము." అని మాతండ్రి నన్నుఁ బంపెను.

అంత వైశంపాయనుఁడు "మిత్రమా! నీభాగ్యవశమున నామూలమున నీపూర్వజన్మము తెలిసెఁగదా" యనన దానికేమి మాతండ్రి సంకల్పించినకర్మమున సహాయము చేయ నన్ను రమ్మనెను. నేను పోవలయును. నీవీయాశ్రమము విడిచిపోవలదని చెప్పి వెళ్లెను.

మానసభాషణము విన్నహారీతుఁడు మునుపటికంటె నెక్కువశ్రద్ధతో నను బోషించుచుండెను. నాకు రెక్కలు వచ్చినవి. ఎగురుటకు శక్తి గలిగినది "మహాశ్వేతను విడిచి యుండగలనా?" అనుకొని యుత్తరకుఁ బోవ బయలుదేరి కొంతదూరము మఱఁగినతర్వాత శక్తి చాలక యొకచెట్టుక్రింద విశ్రమించితిని. మార్గాయాసమున నవశముగా నిద్రపట్టెను. మెలఁకువవచ్చి చూచునప్పటికి నన్నొకకిరాతుఁడు పట్టుకొని యుండెను. అతఁడు నాపాలిటియముఁడని నిశ్చయించుకొని

యు నాసించెను. భద్ర! నన్నేల పట్టుకొంటివి? పట్టుకొన్న వాఁడవు స్వచ్ఛలో నెంచక నేమేల చంపకుంటివి? బంధు దర్శనమునకు నాతురపడుచుంటిఁ గావున నన్ను విడిచిపెట్టుము” అని కోర నతఁడు మహాత్మా! నేను క్రూరజాతిచండాలుఁ డనయినను నిన్ను స్వలాభాశఁ బట్టుకొనలేదు. ఈప్రాంత మున నొకమాతంగరాజు కలఁడు. ఆతని కొకకూఁతురు గల దు. ఎవరివలననో పడిశుక మొకటి యున్నదని యామె విన్నది. ఆపడిశుకము నీవేకదా. నిన్నుఁ బట్టుకొనుట కై నకులను నియమించినది. నా యదృష్టవశమున నీవు నాకు లభించితివి. నిన్నామె కొఱకే పట్టుకొంటిని. అని చెప్పఁ గా, అయ్యో! తుదకిఁ జండాలవాటికలోఁ జండాలబాలిక కా టవస్తువుగా నుండవలసిన గతి పట్టెనా! అనిమిగుల దుఃఖించి దుఃఖిం చి పుండరీకునిజన్మ యూగతికి వచ్చెనా తల్లీ శ్రీదేవీ! నీగర్భ మునఁ బుట్టినవాని రక్షింపవా? ఉపేక్షించి యూరకుందు వా? జనకా! మునికులతిలకా! నాగతి యింతే కావలసినదా! దయయుంచి యుద్ధరింపవా? మిత్రా! కపింజలా! నీవైన నీ పాపగతి తప్పింపవా? తాతా! నీవు నన్ను విడిచిపెట్టి పుణ్య ముఁ గట్టుకొనుము. అని బిగ్గరగా నేడ్చుచున్న నన్నుఁ జూచి కిరా తుఁడు వైశంపాయనా! శుభాశుభకర్మసాక్షులగు పంచభూతము లును నీదేహమునందు లేవా! అవి చూడవా! స్వామ్యాజ్ఞచే నిన్నుఁ బట్టుకొని విడుచుట నాకు న్యాయమా? నిన్ను మా

రాజకన్యకకప్పగించుట న్యాయమని యెంచి నన్నా చండాలబాలికకుం గొనిపోయి చండాలకన్యక కప్పగింప నామె సంతోషముతో మంచిది అని నాఖిని మెచ్చుకొని, నన్నుం బుచ్చుకొని మీఁదఁ జేయి వేసి నిమిరి “ పుత్రా ! నేఁటికి దొరకితివి. ఇంక నిక్కడకుఁ బోయెదవు ? అని యొకపంజరమున నుంచెను.

అంత నాలో నేను నాకు స్పష్టముగా మాటలాడఁగలుగుట బంధహేతువాయెనది గుణము దోషమయ్యెను నాపాండిత్య మిక్కడ జూపితినేని యీ కన్యక నన్ను విడువదు గాన మౌనమవలంబించెదను భాగ్యవశమున నేనికను వాగింద్రియమునే కాదు సర్వేంద్రియములను గూడ బంధించెదను. మొదట సింద్రియనిగ్రహము లేకపోవుటచేనే దివ్యలోకవర్తినగు నాకుఁ గడిది తిర్యగ్జన్మము, అందును చండాలహస్తగతమును సంభవించినది. కావున సర్వేంద్రియనిగ్రహము పూనెదనని నిశ్చయించుకొని నిరశనవ్రతమువలంబించితిని.

చండాలకన్యక నాస్థితి చూచి మఱునాఁడు గూడ జలపానమయినఁ జేయకపోవుటచే మిగుల దుఃఖము నొంది మహాత్మా! పక్షులకు లభ్యమగు పదార్థము తినుట సహజము. వానికి భక్ష్యాభక్ష్యవిచారములుండవు. నీవు శాపవశమునఁ బక్షిరూపమునొందిన మహానుభావుఁడ వని తోఁచెడిని. పక్షిదేహమున నున్నపుడు ఆ విచారమేల? ఒకవేళ నేను చండాలకన్యక

నను సందేహమున్నచో జలఫలములు క్రింద నుంచెదను. గ్రహింపుము. నేలపై నుంచినచో చండాలహస్తమునుండి యైనను జలఫలములు గ్రహింపవచ్చునని నియమవంతులే చెప్పుదురు. క్షుత్పిపాసలచే నిరాకరణము నీయాత్మ నేల బాధపెట్టికొనెదవని చెప్ప నామె సౌజన్యవచనములకు సంతసించి గుణమును బట్టి చూచిన నామె చండాలకన్య గాదని యెంచి జలపానఫలభక్షణములు చేసితిని. మాంసము మాత్రము తినవలేను.

కొంతకాల మయిన తర్వాత నొకప్రభాతమునఁ గన్నులు దెఱచి చూడ చండాలవాటిక యమరపురివలెఁ గనఁబడినది. నేను బంగారుపంజరమున నుంటిని. చండాలకన్యక నీసభాస్థలికి వచ్చిన వేషముతోఁ గనఁబడినది.

ఆ మాఱ్పునకుఁ గారణమేమని యడుగఁ గుతూహలము నాకుఁ గలిగెను గాని మాటాడుటకు నిష్టము లేక యడుగలేదు. తర్వాత నన్ను నీసభాస్థలికిఁ దీసికొనివచ్చినది. ఆమె నన్నేల బంధించినదో? తాను చండాలకన్యక యని యేల ప్రకటించికొన్నదో? నీసభకు నన్నేల తెచ్చినదో? నాకుఁ దెలియదు. నీవలెనే నాకును వినవలెనని కుతూహలము గలదు. ఆమెను బిలిపి యడుగుము మన నామెను బిలిపింప నామె వచ్చి రాజునకెదుట నిలఁబడి ప్రగల్భతతో నిట్లనియెను.

ఓ రాజచంద్రా! భూలోకచంద్రా! కాదంబరీనయ

నానందచంద్ర! యీదుర్బుద్ధి తనచరిత్రమును, నీచరిత్రము నుగూడఁ జెప్పెనుగదా. వీనిహీనజన్మము దప్పింపఁ దండ్రి ప్రతిక్రియసేయుచుఁ గపింజలునిచే జాబాలియాశ్రమము విడువవల దని సందేశ మంపినను కాగాంధుఁడై తండ్రియాజ్ఞ దాఁటి మహాశ్వేతాదర్శనమునకుఁ బోవ బయలుదేఱినాఁడు. అది వీఁడే చెప్పెనుగదా. నేనీదుర్బుద్ధికిఁ దల్లినగులక్ష్మి నని తండ్రిదివ్యదృష్టితోఁ జూచి "యీయవినీతునకుఁ బశ్చాత్తాపము గలుగ లేదు. ఇంకను వీఁ డధోగతి పాలగును. వీనిని బంధించి పశ్చాత్తాపము నొందునట్లుచేయు" మని నన్నాజ్ఞాపించెను. నేనట్లు చేసితిని. అతఁడు సంకల్పించినకర్మయును పూర్తియగును. మీకు శాపావసానకాలమును ఆసన్నమయినది. మీయిరువురకును శాపావసాన మేకకాలముననే యగును గాన నితని నీసన్నిధికిఁ దీసికొనివచ్చితిని. జనసంపర్కపరిహారమునకై చండాలజాతివార మని ప్రకటించితిమి. మీరు మీప్రియురాండ్రఁ బొంది సుఖ మనుభవింపుఁడు. జరామరణాదిపీడితములగు నీశరీరములు విడిచి స్వస్వదేహములఁ బ్రవేశింపుఁ డని చెప్పి యాకాశమున కెగిరెను. ఆమాటలు విన శూద్రకునిహృదయము కాదంబరియందును, వైశంపాయనునిహృదయము మహాశ్వేతయందునులగ్నమయి వారువిరహవేదన నొందుచుండిరి. ఆవిరహవేదన మరణవేదనగా బ్రజలకుఁ గనఁబడెను. తుదకు వా రాశరీరములు విడిచిరి.

౯

అట కాదంబరి చంద్రాపీడునిశరీరమునకు యథాప్రకారము పరిచర్యఁ జేసి యలంకరించి ముఖముచూడ నొకనాఁడు పూర్ణజీవకళవచ్చుటయే గాక కంఠమునఁ బ్రాణముపచ్చినట్లు కనఁబడ నామె గాఢాలింగనముచేసికొనెను. ఆమెశరీరస్పర్శమున నాతఁడు సంపూర్ణజీవము నొంది యామె నాలింగనము చేసికొనెను.

స్త్రీసహజమగు భయ మామెకుఁ గలిగె నని యాతఁడు గ్రహించి ప్రాణేశ్వరీ ! భయమేల ? అమృతసంభవులగునప్సరసలకులమునఁ బుట్టిన నీకరస్పర్శచేతనే పునరుజ్జీవితుఁడ నయితిని. ఈశరీర మవినాశ యనియు, కాదంబరీహస్తస్పర్శనమునఁ దృప్తినొందెననియు నాఁడు ఆకాశవాణీరూపమునఁ జెప్పితిని. నీవు వినలేదా ? శాపవశమున శూద్రకుఁడను పేరితో మనుష్యశరీరమునఁ గాలము గడపితిని. ఇప్పటికి శాపావసానమయినది. చంద్రలోకమును ఈలోకమును నీయధీనములు. నీకుఁ బ్రియసఖియగు మహాశ్వేతకుఁ బ్రియుఁడగు నామిత్రునకుఁగూడ నాతోపాటే శాపాంతమయినది. అని చెప్పుచుండఁగా, పుండరీకుఁడు పూర్వవేషముతో మహాశ్వేత యిచ్చిన యేకావళి ధరించి, మునుపటికంటె నుత్తమమగుశరీరకాంతిపరిమళములు గలిగి కపింజలునితోఁ గలిసి యాకాశమునుండి దిగుచుండెను. కాదంబరి యాతనిఁ జూచి ప్రియుని

కౌఁగిలివిడిపించుకొని పరుగున మహాశ్వేతవద్దకుఁబోయి యా
లింగనము చేసికొని యామెకుఁ బుండరీకాగమనవార్త తెలిపె
ను. పుండరీకుఁడు చంద్రాపీడునివద్దకు రాఁగా నతఁడు పుం
డరీకునిఁ గౌఁగిలించుకొని "మిత్రా! పూర్వజన్మసంబంధ
మున నల్లుఁడవు. అనంతరజన్మమున స్నేహబాధుఁడవు. ఇతర
బాంధవములకంటె స్నేహబాంధవమే యెక్కువగదా నాతోడ
నుండఁదగినవాఁడ వని చెప్పుచుండఁగా, కేయూరకుఁ డీవార్త
చిత్రరథహంసులకుఁ దెలుపఁబోయెను.

మదలేఖ మృత్యుంజయమంత్రజపము చేయుచున్న తా
రాపీడునిదగ్గఱకు వడిగాఁబోయి "యువరాజు పునరుజ్జీవితుఁ
డయ్యె" నని బిగ్గరగాఁ జెప్ప విలాసవతి శుకనాసమనోరమ
లతోఁ గలసి పరుగుపరుగునఁ బోయి పుండరీకునిఁ గౌఁగిలించుకొ
నియున్న చంద్రాపీడునిఁ జూచి, సంతసించి శుకనాసునితో
శుకనాసా! నే నొక్కఁడనే పుత్రపునర్జీవనమున సంతసింపలేదు.
అట్టిభాగ్యము నీకును గలిగినది. అనియనుచుండఁ జంద్రాపీ
డుఁడు తండ్రికి సాష్టాంగనమస్కారము చేయఁ దండ్రి లేవఁదీసి
"కుమారా! నాపుణ్యవశముననో నీయున్న భాగ్యవశముననో
నాకుఁ గుమారుఁడవయి పుట్టితివి నీవు సర్వవంద్యుఁడవు. అది
గాక లోకపాలాంశమగు రాజధర్మము నీయందే యుంచి
తిని. రాజధర్మమునఁ గూడ నీవే వంద్యుఁడవు. అని యాలిం
గనము చేసికొనెను. తల్లియగు విలాసవతియుఁ గౌఁగిలించుకొని

మిగుల నానందించెను.

అంతఁ జంద్రాపీడుఁడు శుకనాసమనోరమలకు నమస్కారముచేసి పుండరీకునిఁజూపించి "యాతఁడే మాపుత్రుఁ డగువైశంపాయనుఁ డని చెప్పఁ బుండరీకుఁడు సిగ్గునఁదలకొంచెము వంచుకొనెను.

అప్పుడు కపింజలుఁడు శుకనాసునిఁ బలుకరించి శ్వేతకేతువు నాచేఁబంపిన సందేశమువినుము. "పుండరీకుని నేను కేవలము పెంచితినిగాని నీ కాత్మజుఁ డితఁడు. మీయందే యీతనికి స్నేహము మెండు. ఈతఁడే వైశంపాయనుఁడు. కావుననే శాపావసానమున నీయొద్దకే పంపితిని. ఉపేక్షింపరాదు. మఱియు నాజ్యోతిస్సు దివ్యలోకమువీడి యూర్ధ్వలోకమునకుఁ బోవనుద్యమించినది. ఇదే నా సందేశము" అని చెప్ప, పుండరీకుఁడు వినయమునశుకనాసునియెడల సమ్రితచూపనతఁడుభుజశిరస్సునఁ జేయువేసి పట్టుకొని కపింజలునితో "కపింజలా! దివ్యదృష్టిగల శ్వేతకేతువునకుఁ దెలియదా! యీతనియందుగల స్నేహమునకుఁ బరిమితియే లేదు." అని పలుకుచుండఁగాఁ బ్రభాతమయ్యెను.

ప్రాతఃకాలమున గంధర్వరాజులగు చిత్రరథహంసులు మదిరాగౌరీదేవులతో సపరివారులయి వచ్చి సిగ్గుపడుచున్న పుత్రికలను జూచి సంతసించి, యల్లుఁడ్రఁ జూచి యానంద మొంది వియ్యంకులగు తారాపీడశుకనాసులతో సంభాషో

చితసంభాషణములుచేసి యపరిమితానందము నొందిరి.

అంతఁ జిత్రరథుఁడు తారాపీడునితో "పరస్పరాభిరుచితోఁ స్వయముగా వరించి చేసికొనిన వివాహామే ధర్మ్యము. అయినను లోకవ్యవహారానుసారముగా జరుగవలసినవివాహమహోత్సవము మాపురమునకు వచ్చి జరిగింపుఁడు. మాకు దివ్యభవనము లుండఁగా ఈయరణ్యమున నుత్సవము చేయుట యేల? అన నతఁడు "గంధర్వరాజ! ఎక్కడసుఖముగలుగునో అదియే దివ్యభవనము. ఎక్కడను అది లేదో యదేయరణ్యము. నాకిక్కడనే పుత్రదర్శనసుఖభాగ్యము గలిగినది. ఇదియే సుఖస్థానము.

మఱియు నీయల్లునియందు గృహసుఖము లింతకుమున్నే యుంచితిని. నీయల్లునిఁ గూఁతునుగొనిపొమ్ము. మీ రందఱును గృహసుఖము లనుభవింపుఁడు. అన నతఁడు మీయిష్టప్రకారమే చేసెద మని చెప్పి కాదంబరీచంద్రాపీడులను దీసికొని హేమకూటమునకుఁ బోయి తనరాజ్య మల్లునికిఁ గానుకగా నర్పించెను.

హంసుఁడు మహాశ్వేతాపుండరీకులను దీసికొనిపోయి తనరాజ్యము పుండరీకున కిచ్చెను. వారు ప్రియురాండ్రఁ బొందఁగలిగినందులకే తృప్తినొంది యితరమంతయు మామగారలకే యర్పించిరి. కాదంబరి తాను వరించినప్రియునిఁ బొందుటచే నపరిమితానంద మొందియు, ఏదోవిచారము హృదయ

మునునున్నట్టు విషణ్ణముఖియై చంద్రాపీడుని "ఆర్యపుత్రా!
మనకుఁ జావులును బ్రతుకులును సంభవించినవి. తుదకు బు
నరుజ్జీవితుల మయితిమి సరే. పాపము! పత్రలేఖ మనతో లే
దేమి? ఆమె యేమయ్యెను? అనియడుగ నతఁడు "ప్రాణేశ్వరీ!
ఆమె యిక్కడ నెట్లుండును? ఆమె రోహిణి. నేను శాపవశ
మున భూలోకమున జన్మింపవచ్చుట విని "ప్రియా! నిన్నొంట
రిగాఁబోయి మర్త్యలోకనివాసదుఃఖ మనుభవింప లేవు. ఉప
చారములుచేయ నేనును వచ్చెద నని వలదన్నను మానక మ
ర్త్యలోకమున జన్మించినది. నేను శాపవశమున జన్మాంతరము
నొందినపుడు ఆమెయు మరొకజన్మము నొందఁబోవ వలదని
నిర్బంధపెట్టి దేవలోకమునకుఁ బంపితిని. ఆమె నక్కడఁ
జూడఁగలవు" అని చెప్పెను.

కాదంబరి యదివిని రోహిణియుదారతకును మహాను
భావతకును పాతివ్రత్యమునకును స్నేహధర్మమునకును ఆశ్చ
ర్యమొంది తానుచేసినపరిచర్య యెంతి యని సిగ్గుపడి యూర
కుండెను.

చంద్రాపీడుఁడు రెండుజన్మములనుండి యభిలషించిన
దాంపత్యసుఖము నాఁటికి లభించినందులకు సంతసించి పదిదిన
ము లక్కడనుండి యత్తమామలసెలవుగైకొని భార్యతోఁగల
సి తల్లిదండ్రులపాదసన్నిధి కరిగెను. పుండరీకుఁడును భార్యా
సహితుఁడయి యాతనితో నాశ్రమమున కరిగెను. చంద్రపీ

డుండు తనతో మొదట వచ్చి సకలదుఃఖములు ననుభవించిన రాజవర్గము నాదరించి పుండరీకునియందు రాజ్యభార ముంచి వారలనందఱను పురమునకుఁ బంపెను.

తల్లిదండ్రులపాదసేవ చేయుచు జన్మభూమియందలిస్నేహమున నొకప్పు డుజ్జయినియందును, రోహిణియందలిగౌరవమున నొక్కొ-కతఱిఁ జంద్రలోకమునను, పుండరీకునియందలి ప్రీతిచేత నొక్క-సమయమున లక్ష్మీనివాసమగు సరస్తీరమందును, గంధర్వరాజునందలిగౌరవమున నొకప్పుడు హేమకూటమునను నివసించుచుండెను. మహాశ్వేతాపుండరీకులును, కాదంబరీచంద్రాపీడులును నలువురును, పరస్పరము కలసిమెలసియుండి సర్వకాలమును సర్వసుఖములు ననుభవించుచుఁ బ్రజలకు సర్వసౌఖ్యములు గలిగించుచు నిట్లు తలఁచుచుండిరి.

లోకా స్సమస్తా స్సుఖినో భవంతు.